## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010006317



**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మూడు కావ్యాలు

## రామాయణ భారత భాగవతముల సమీక్ష

మూడు విశ్వవిద్యాలయములలో
పఠనీయము చేయబడి గౌరవింపబడిన గ్రంథరాజము



రచయిత
వీరరాఘవాచార్యులు

.

౧

# రా మా య ణ ము

భారతదేశములోఁ గల భాషల కన్నిటికిని సాధారణముగా సంస్కృతము మూలమని చెప్పవచ్చును. సంస్కృత భాషలోని పెక్కుపదము లీ దేశభాషలోఁ గలిసియున్నవి. సంస్కృతభాషా పదములను తత్సమములుగా నేని, తద్భవములుగా నేని తనలోఁ గలిపికొనక యీ దేశములోని యే భాషయు స్వయంసంపూర్ణతను సంపాదించుకొన లేదు. భారతీయభాషల కేగాక గ్రీకు, లాటిన్ మున్నగు భాషలకును సంస్కృతముతోడి పొత్తు చాల యున్నదని భాషాశాస్త్రము బట్టి రుజువగుచున్నది. ఆ కారణముచేత సంస్కృతమే ప్రపంచభాషల కన్నింటికిని మూలమని మొట్టమొదట భాషాశాస్త్రజ్ఞులు తలంచిరి. కాని భాషావిమర్శ దినదినాభివృద్ధి నందినకొలఁదిని సంస్కృత మెల్ల భాషలకును మూలము కాదనియును, గ్రీకు, లాటిన్, జర్మానిక్, పారసీ, కెల్టిక్, సంస్కృతము మున్నగునవి సోదర భాషలనియును, వీని కన్నింటికిని మూలమైనభాష యొకటి అనాదికాలమున నుండి యుండుననియును భాషాశాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. కావున ప్రాచ్యపాశ్చాత్యములగు నెల్ల భాషలును మాతృభూతమగు

నొక ప్రథమభాషనుండి పుట్టియున్నవి. కాని ఆ ప్రథమభాష యీ నాఁ డెచ్చటను వ్యవహారమునందు గాని, గ్రంథము లందుఁగాని లేదు. లేకపోయినను అట్టి మాతృభాషనుండి యున్ని భాషలు పుట్టుటచేతను, వీనిలో పరస్పర సాజాత్య ముండుటచేతను ఇవి యన్నియును సోదరభాషలయి ఆ భాష లను మాటలాడువారిని గూడ సోదర వర్గములని నిర్ణయింప వీలును గలిగించుచున్నవి. కావుననే ప్రపంచ సాహిత్యము లన్నిటను మొట్టమొదట వెలువడిన గ్రంథములను బరికించి నచో కథలయందో, గాథలయందో, కల్పనలయందో సంస్కృ తులయందో, ఆయా దేవతల నిర్దేశించుటయందో వేఱు చేయరాని సాజాత్యము సమానత మున్నగులక్షణము లగపడు చున్నవి.

ప్రాచీనములగు ప్రపంచ భాషలలో సోదర భాషగా నెన్నఁబడిన మన సంస్కృతము భారతీయభాషల కన్నిటికిని మాతృకయై ప్రకాశించుటతో నూరకొన లేదు. తనలోనున్న అఖండ విజ్ఞాన వాహినులను, మత సంస్కృతి ప్రవాహము లను, గంభీరములైన చారిత్రక కథోద్ఘాతములను తన బిడ్డ లనఁదగు దేశభాషలలోని కెక్కించి జీర్ణింపఁ జేసినది. భారత దేశమునందుఁగల మానవులలోని విజ్ఞాన మంతయు నీ సంస్కృత వాఙ్మయమునుండి సంక్రమించినదే. ఒకానొకప్పుడు సంస్కృతభాషయే దేశభాషగా నున్నది గావునను, విజ్ఞాన

మంతయు నంచే వృద్ధియగుటయు సంభవించినది. సంస్కృత భాషలోని విజ్ఞానమును ప్రకాశింపఁజేయుటకే - దానిని దేశ భాషామాత్ర పరిజ్ఞానులగు ప్రజానీకమున కందించుటకే భారతీయభాషలు పూనుకొన నైనది. అంతియే కాని ఆయా భాషల కునికియైన దేశములకు సంబంధించిన విజ్ఞానము, నాగరికత, సంస్కృతి అనునవి అంతగా లేవని చెప్పవచ్చును. ఉన్నచో నవి యేకొలఁదియోగాని చెప్పతగినంతగా లేవు.

అతి ప్రాచీన కాలముననే జ్ఞాన విజ్ఞానములను గైవసము చేసికొన్న సంస్కృతభాషలో తొలుదొల్త-జ్ఞాన ప్రధానమగు ఋగ్వేదము పుట్టినది. తరువాత కర్మప్రధానమగు యజుర్వేదము, భక్తి ప్రధానమగు సామము, శిల్పము, వైద్యము మున్నగు ననేక విషయముల కాకరమగు నధర్వవేదము నుద్భవించినవి. అటుపిమ్మట బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, సూత్రగ్రంథములు, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, జ్యోతిషము, ఛందస్సు అను వేదాంగములు, శాస్త్రములు, దర్శనములు, పురాణములు, ఇతిహాసములు, కావ్యములు, నాటకములు, ప్రహేళికలు మున్నగాఁగల అసంఖ్యాక గ్రంథములు తలయెత్తినవి. ఇట్లు క్రమముగా సంస్కృతభాషయొక్క విరివి యింతింతన రాక పెరిగినది. ఈ వాఙ్మయమునం దంతటను పూర్వవిజ్ఞానము నాధారముగాఁ జేసికొనియే తరువాతి సాహిత్యము

పెరుగుట, చరిత్ర ప్రవర్తిల్లుట, మత విశ్వాసములు వృద్ధి నొందుట అనుధర్మము స్వాభావసిద్ధమైనది. బీజప్రాయమును, సనాతనమును నగు వైదిక సిద్ధాంతము నూతగాఁ గొని దానిని వికసింపఁజేయుటకే దర్శనములుగాని, శాస్త్రములు గాని, పురాణేతిహాసాదులుగాని పూనుకొనుట భారతీయ సాహిత్య చరిత్రయొక్క ప్రత్యేకత. సంప్రదాయమనునది భారతీయులు ప్రాణప్రదముగా నభిమానించు ధర్మము.

సంస్కృత భాషలోని యీ వేదాది మహాగ్రంథముల యుద్దేశ్యము మానవుఁడై పుట్టినవాఁడు ధర్మార్థ కామ మోక్షములను పురుషార్థములను సాధించి యమృతుఁడగుట. అసత్తునుండి సత్తులోనికి, తమస్సునుండి జ్యోతిలోనికి, మృత్యువునుండి అమృతత్వములోనికి పయనించుటయే మానవుని పరమలక్ష్యము. ఆ లక్ష్యమును సాధించుటకు సత్యధర్మములు, కర్మజ్ఞానములు, భక్తిప్రపత్తులు, దయాదాక్షిణ్యములు, శమ దమాహింసాదులు మున్నగునవి సాధనములు. ఈ సాధనసామగ్రిని నయమునగాని, భయమునఁగాని మానవున కలవడఁజేయుటయే సాహిత్యప్రయోజనము. భారతీయ సాహిత్య మిట్లు సదుపదేశముద్వారమున నరుని వైహిక జీవనమును, పారత్రిక జీవనమును సుఖసంపన్నము చేయుటకు యత్నించినది. ఆ ప్రయత్నములో వేదశాస్త్రములు ప్రభుసమ్మితము లైనవి. ప్రభువు "ఇది చేయుము. అది

చేయవలదు" అని ప్రజల నెట్లు శాసించునో, అట్లే వేదమును మనుష్యులకు ధర్మాధర్మముల ననుశాసించుచున్నది. "మాతృ దేవో భవ, పితృ దేవో భవ, ఆచార్య దేవో భవ, సత్యం వద, ధర్మం చర, న హింస్యా త్సర్వాణి భూతాని, న కలంజం భక్షయేత్, న పరదారాన్ గచ్ఛేత్" ఇత్యాది వైదిక శాసనములు మానవుల కవశ్య మనుష్ఠింపఁ దగినవి. రాజాజ్ఞవలె కఠినమగు నీ వేదశాసనము నంగీకరించుట కెల్లరును సంసిద్ధులుగారు. అయినను కష్టముమీఁదనేకాని బుద్ధిపూర్వకముగ నెవ్వరును గాఁజాలరు. సత్యధర్మముల నాచరించుటచేఁ గల్గు ఫలమేమో, ఆచరింపమిచేఁ గల్గు ననర్థమేమో యితరుల యనుభవమునుబట్టి గ్రహించినపిదప మానవుఁడు చెప్పకుండగనే వాని ననుష్ఠించును. అనఁగా పూర్వ పురుషుల చరిత్రములు విన్నచో వారి యాచరణము ననుసరించి వారు పొందిన లాభనష్టముల నెఱింగి, మనుజుడు తన నడవడిని దిద్దుకొనఁ గలుగుచున్నాఁడు. పరనారీ పరాయణతచేఁ గల్గిన దుష్ఫలితము నొందిన రావణ కీచకాదులను గాంచి మానవుడు తాను పరనారీపరాఙ్ముఖుఁడగుట సులభమో లేక "న పరదారాన్ గచ్ఛేత్" అను వేదవచనముచే నగుట సులభమో మీరే యాలోచింపుడు. కావున కథోపాఖ్యానముల ద్వారమున నీతిని, ధర్మమును బోధించుటకు పురాణేతిహాసము లవసరము లయినవి.

## మూ డు  కా వ్యా లు

శబ్దప్రధానమగు వేదము ప్రభువువలె కఠినముగా శాసించుచుండ అర్థప్రధానములగు పురాణేతిహాసములు మిత్రునివలె మంచిచేయుటచేఁగల్గు మేలును, చెడు చేయుటచేఁ గల్గు కీడును కథోపాఖ్యానములద్వారమున బోధించి మానవులకు హితప్రవృత్తిని, అహితనివృత్తిని గలిగించుచున్నవి. అందుకే పురాణాదులు సుహృత్సమ్మితము లని యాలంకారికు లన్నారు.

వేదపురాణముల తరువాత నెన్నఁదగిన దింకొకటి కావ్యమార్గము. కావ్యములో ప్రధానమగు నితివృత్తము కావ్యశిల్పముచే రమణీయ మొనర్పఁబడి పాఠకులదృష్టిని ప్రధానభూతమగు ధర్మముమీఁది కాకర్షించును. కావ్యశిల్ప సౌందర్యమునకు ముగ్ధులైన పాఠకులు రసానందము ననుభవించి కావ్యసౌందర్యముచే నలంకృతమైన యితివృత్తము బోధించు వ్యంగ్యభూత విషయమునం దనురక్తులగుదురు. అప్పుడు వారు తమ కర్తవ్యాకర్తవ్యములను కావ్యప్రబోధానుసారముగా నిశ్చయించుకొందురు. అందుకే కావ్యము కాంతాసమ్మిత మని పెద్ద లనియుండిరి. సౌందర్యవతియగు కాంత తన కటాక్ష భ్రూ విక్షేపాది విలాసముల చేతను, ఆంతరికములగు రమణీయ గుణములచేతను మనోహరు నలరించి స్వాభీష్టమును నెఱవేర్చుకొనునట్లే, కావ్యమును దన గుణాలంకార రసభావముల సౌందర్యముచే

పతితల నలరించి వారిచేఁ దాను చెప్పినట్లు చేయించఁ గలదు. కావుననే కావ్యమునుండి కర్తవ్యతాబుద్ధి సరసముగా నుద యించుననియు, తదితరములగు వేదశాస్త్రాదుల కట్టి శక్తి లేదనియు నాలంకారికు లనుచున్నారు.

కనుక వేదముయొక్క ధర్మానుశాసనమును పురా ణము కథోపాఖ్యానములలోఁ గలిపి కొంతవఱకు సులభముగ నాచరణయోగ్యము చేసెననియు, నద్దానిని సగుణమును, నిర్దోషమును, సాలంకారమును, రసప్రచురము నగు కావ్యము మఱింత సులభతర మొనర్చి యాచరణమునకు బాఠకులఁ బురికొల్పు చున్నదనియును పిండితార్థము. వేదార్థమును బురా ణమును, పురాణ విషయమును కావ్యమును అనువదించి సుగమము చేయుచున్నవని యాలంకారికులు సిద్ధాంతీకరించి యున్నారు. అందుకే ఉత్తమములగు కావ్యనాటకములకు ప్రఖ్యాతమగు నితివృత్తము కావలయునని శాస్త్రము చెప్పుట.

వేదములోని యూర్వశీ పురూరవుల సంవాదగాథ పురాణములలో నుపక్షిప్తమై యటనుండి కాళిదాస కవీం ద్రుని కవితాశిల్పములో "విక్రమోర్వశీయ నాటక" రూప మును ధరించినది. అట్లే భారతేతిహాసములోని దుష్యంతో పాఖ్యానము కాళిదాస కవితాచిత్రితమయి, అద్భుత సన్నివేశ ములతో "అభిజ్ఞాన శాకుంతలము"గా రూపొందినది.

## మూ డు కా వ్యా లు

సాధారణముగా అనేక కావ్యములయు, కథోపాఖ్యానములయు రాశియే పురాణముగాని, యితిహాసముగాని. అయినప్పుడు కావ్యపురాణములకు భేదము చెప్పవలసిన యవసరము లేదని యందురేమో! పురాణము పెక్కు కథాంశములను నిరూపింపవలసి యుండుటచేత కావ్యగుణము లిందు ప్రచురముగా నుండవలసిన పనిలేదు. ఉన్న యితివృత్తము నున్నట్లు వర్ణించినచో దానిపని తీఱును. కావ్యవ్యాపార మట్లుగాదు. ఇతివృత్తములోని లోపములను సవరించి దానిని ధర్మసమ్మితముగా నొనర్పవలసియున్నది. రామాయణములో చెట్టుచాటునుండి వాలివధము నొనర్చుట నాయకున కపకర్షను బాటిల్లఁజేసినందున నాటకకారులు దాని నన్యథా కల్పించుకొనవలసివచ్చినది. శాకుంతలములో దుష్యంతుడు శకుంతల నెఱింగియు నెఱుగననుట యుదాత్తనాయకలక్షణము కానందున దుర్వాసశ్శాపము కల్పింపవలసి వచ్చినది. ఇట్టి మార్పులు చేయుట కావ్యములో నవరసమైనందువలన కావ్యేతిహాస పురాణములకు భేదము సిద్ధమగుచున్నది.

భారతీయుల కత్యంతము ప్రీతిపాత్రములైన గ్రంథములలో భారత భాగవత రామాయణములు ముఖ్యములు. ఈగ్రంథత్రయము నందలి కథలు మన బాలుర కుగ్గుబాలతో రంగరించి పోయుచుందురు. అక్షరజ్ఞానము లేని వారలకును ఇందలి కథలు సుపరిచితములై యుండును. ఈమూఁడు

హోత్రములును మూడు సంధ్యలయందును, పారాయణ మొన ర్పఁదగినవి. ఉదయమున రామాయణమును, మధ్యాహ్న సమయమున భారతమును, సాయంసమయమునఁ గాని రాత్రి వేళగాని భాగవతమును పఠించుచుండుట భారతీయుల యాచారము. కర్మప్రవృత్తిని కల్గించు భారత రామాయణములను పవలును, భక్తిజ్ఞాన వైరాగ్యముల నొడగూర్చు భాగవతమును దినాంతమునను పారాయణ మొనర్చుటలో నుత్తమ మగు ప్రయోజన మున్నది.

ఈ గ్రంథత్రయములో భారత మితిహాసము, భాగవతము పురాణము, రామాయణము కావ్యము. భారతమును గూడ కావ్య మనుటయు, రామాయణము నితిహాస మనుటయుఁ గలదు. భాగవతముమాత్ర మష్టాదశ పురాణముల లోనిదే. కౌరవ పాండవుల చరిత్రముగల భారతముకన్నను శ్రీకృష్ణచరిత్రము ప్రధానముగాగల భాగవతమునకన్నను పురాతనమగు రామకథాంశముగల రామాయణము మొట్ట మొదటిదైనందున తొలుదొల్త రామాయణమును గూర్చి ముచ్చటింతము.

రామాయణ మాదికావ్యము. దానిని రచించిన వాఁడు తపస్వియు మునిపుంగవుఁడునగు వాల్మీకి మహర్షి. వాల్మీకి యొకానొకప్పుడు ధర్మజ్ఞుడును సత్యసంధుఁడును, శౌర్యౌదార్యాది మహాగుణములు గల యుదాత్త చరిత్రు

డెవ్వఁడని నారదమహర్షిని ప్రశ్నించెను. ఆ దేవర్షి రాముని గుణగణములను వర్ణించి వాని చరిత్రమును సంగ్రహముగా వాల్మీకి కుపదేశించెను. తరువాత వాల్మీకి యొక మధ్యాహ్న కాలమున సంధ్యావందనమునకై తమసాతీరమున కేగెను. మాధ్యాహ్నిక సవనము నిర్వర్తించుచున్న యా మునికంటి కొక కరుణాదృశ్యము గోచరించినది. ఎట్టయెదుట నున్న చెట్టుకొమ్మమీఁద క్రౌంచపక్షులు రెండు క్రీడించుచున్నవి. కఠిన హృదయుఁడగు నొక బోయవాఁడు ఆ పక్షుల ప్రణయ ఘట్టమునేని లెక్క సేయక యొక వాఁడియగు బాణముచే మగపక్షిని గొట్టెను. ఆ దెబ్బచే నది నేలఁ బడి విలవిల తన్నుకొని చచ్చెను. జంటపక్షిని గోల్పోయిన పెంటిశోకమున కంతము లేదయ్యెను. కిరాతుఁ డొనరించిన యీ ఘాతుక కృత్యమునకు వాల్మీకిహృదయమున క్రోధరస ముదయించెను. క్రౌంచద్వంద్వము పాటునకు ఋషిహృదిలో శోకరసప్రవాహములు జాలువాఱినవి. ఆకస్మిక ప్రత్యవభాస ముగా నాతని నోటినుండి ఛందోబద్ధములగు నీ మాటలు వెలువడెను.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్ క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్."

"ఓ నిషాదుఁడా! కామమోహితమైన క్రౌంచమిథునములో నొక్కదానిని జంపిన నీవు పెక్కేండ్లు వర్ధిల్లబోవు

సుమా!" ఈ శ్లోకములోనే రామాయణ కథాసూచకమైన రెండవ యర్థమును కలదు. "లక్ష్మీరమణుఁడవగు నో రామా! కామమోహితుఁడగు నసురనుజంపిన నీవు శాశ్వతకాలము ప్రతిష్ఠ నందుదువుగాక" అని.

రామాయణ కావ్యావతరణకు ఈ క్రౌంచమిథున కథ హేతుభూతమైనది. వాల్మీకి మహర్షి "మానిషాద" అను శ్లోకము నుచ్చరించు నంతవఱకును వైదికవాఙ్మయ మందే కాని లౌకిక వాఙ్మయములో ఛందోబద్ధమగు వాణిలేదు. తన నుండి వెలువడిన యీ యాకస్మికవాణికి వాల్మీకి వెఱగందినాడు. అప్పు డాతనికి బ్రహ్మ ప్రత్యక్షమై వాని నాదికవి యని దీవించి, రామచరితమును వ్రాయుమని యాదేశించి పోయి నాఁడు. తరువాత వాల్మీకిమహర్షి రామాయణమును వ్రాసెను. ఆ కారణమున వాల్మీకి యాదికవియై వన్నె కెక్కెను. ఆతనికృతియగు రామాయణ మాదికావ్యముగా ప్రసిద్ధ మయ్యెను.

రామాయణమునం దేడుకాండములు, ఇరువదినాలుగు వేల శ్లోకములు నున్నవి. ఈ సంఖ్యలు సైతము ఆధ్యాత్మికమగు నర్థవిశేషమును సూచించుచున్నవి. ఆఱుకాండములు నాధారాది షట్చక్రములను, ఏడవకాండము సహస్రారపద్మమును సూచించుచున్నవి. జీవాత్మ యాధారాది షట్చక్రముల మీఁదుగా యోగమార్గమున పయనించి సహస్రారము

నం దఖండపరమాత్మతో నైక్యమై బ్రహ్మానందము నందునని యోగశాస్త్రము చెప్పుచున్నది. అట్లే ప్రకృతి పురుషస్వరూపులును, మాయామహేశ్వరస్వరూపులును నగువారు సీతారాములు. ఆఱుకాండములలోను సీతారాముల యితివృత్త ముపవర్ణిత మగుచున్నది. ఏడవకాండములో మాయాస్వరూపిణియగు సీత భూగర్భమున లీనమగుటయు, పరమాత్మస్వరూపుడగు రాముడొక్కడే శేషించుటయు జరుగును. ఈయంశములుగూడ సహస్రారమునందు మాయాసంబంధము లేని పరమాత్మ సాక్షాత్కారము కల్గుటను, మాయ నివృత్తమగుటను తేటపఱ జేయుచున్నవి.

గాయత్రీమంత్రమునం దిరువదినాలు గక్షరములు కలవు. ఆదికవి యామంత్రమునందలి యొక్కొక యక్షరముతో రామాయణములోని యొక్కొక్క సహస్రమునందలి మొదటిశ్లోకమును ప్రారంభించుచున్నాడు. ప్రారంభమున "తపస్స్వాధ్యాయ నిరతమ్" అని మంత్రములోని తొలియక్షరమగు తకారముతో కావ్యారంభము చేసినాడు. ఇటులే తక్కిన సహస్రముల యాద్యములు నున్నవి. ఇట్లు గాయత్రీమంత్రము నొక క్రమము ననుసరించి కావ్యములో నిముడ్చుట తత్పాఠకుల కిద్దానిని వేదసమ్మితముగా నొనర్చియిచ్చుటను దలపించుచున్నది. ఇట్టి యాధ్యాత్మిక రహస్యములు రామాయణములో నెన్నియో యున్నవి. అందుచే

నీ యాదికావ్య ముత్తమోత్తమమును పూజనీయమును నైన గ్రంథమై వెలుగుచున్నది.

భారతీయ రాజవంశములలో సూర్యవంశము నాయక మణి వంటిది. ఆ యిక్ష్వాకురాజులు రాజధర్మమును, మానవ ధర్మమును పాలించుటలో వెనుకంజ వేయనివారు. సత్యధర్మ ముల ననుష్ఠించుచు ప్రజానురంజకముగా రాజ్యముచేసి వీరు జగదాదర్శ ప్రాయులైరి. ప్రజలకొరకై యెంతటి త్యాగము నైనను జేసి వీరానాటి మానవసంఘములో మెప్పులను బడసిరి. బాల్యమున విద్యాభ్యాసము, యౌవనమున విషయోప భోగము, వార్ధకమున మునివృత్తి, యోగమార్గమునఁ జివరకు తను త్యాగముచేసి వీరు మానవత్వము పరిపూర్ణమగుటకు దారి చూపిరి. ఈ విధముగా నాల్గాశ్రమముల ధర్మమును నడిపించి మానవజీవిత సాఫల్యమున కేనాఁడో పునాదులు వేసిన యిన వంశ్యులు వందనీయులు. వారి చరిత్ర విస్తరమును సాకల్యముగా వివరించు రామాయణ ముత్తమ కావ్యము.

కుటుంబమునకును, సమాజమునకును ఆదర్శప్రాయము లైన విధానములు రామాయణములో వివరింపబడిన ట్లింకొక కావ్యమున సూచింపఁబడలేదన్న నతిశయోక్తి కాదు. రామ చంద్రుని కుటుంబము సర్వలక్షణ సంపన్నమైనది. ప్రజాభి మతమైన యిక్ష్వాకువంశవార్ధి కీతడు సుధాంశుఁడు. ఆతని భార్య సీతాదేవి యొక చంద్రిక. ఆ ముగ్గురు తమ్ములు,

వారి భార్యలు, మంత్రి సామంతాదులు, హనుమత్సుగ్రీవ విభీష ణాదులు అందఱును గుణరత్న మహోదధులు. అందు రామ మూర్తి యొక అసదృశ మానవుడు.

మానవోత్తమున కుండవలసిన సత్యము, ధర్మము, శీలము, శౌర్యము, గాంభీర్యము, క్షమ, దూరాలోచనము, ధైర్యము, కరుణ, శాంతి మున్నగు మహాగుణము లన్నియు రామునిలో నున్నవి. మాతాపితృ గురుజనముల గౌరవించు టలో రాముఁడు మేటి. ఆతని పితృభక్తి సాటిలేనిది. తండ్రి యాజ్ఞయేయైనచో దారుణాగ్నిలో దుముకుటకును, హాలా హలమును సుధాసారమువలె పానము సేయుటకును, మహో న్నత పర్వతాగ్రమునుండి దుముకుటకును రాముఁడు వెను దీయఁడు. ఆతఁడు వనవాసమున కేఁగుట పైవానికిఁ దీసి పోవు పనిగాదు. పై కార్యము లొక్కసారిగా ప్రాణములకు ముప్పు గూర్చును. నానా క్రూరజంతు సమాకీర్ణమును, రాక్షసజన దూషితమును, మహోపద్రవ సంయుతమును నగు వన నివాసము క్షణక్షణమును దుఃఖభాజనము కాదా? అట్టి వనవాసమును తండ్రి సవతితల్లి కొనర్చిన వాగ్దానమును సంరక్షించుటకొఱకై రామమూర్తి యంగీకరించినాఁడు కాదా? మహాభోగముల ననుభవింప ననువైన సామ్రాజ్యమున నభిషేకింప నాహ్వానించినను, భయంకరారణ్యముల కరుగ వలసినదని యానతిచ్చినను ఆతని ముఖములో తొలివనికి

వికాసమును, మలిపనికి వికారమును నగపడలేదు. రెండు కార్యముల నా పుణ్యమూర్తి సంతోషముగనే నిర్వహింప సంసిద్ధుఁడయినాఁడు. ఎంత మహాసత్త్వము! ఎంతటి శీతోష్ణ సుఖదుఃఖ సమభావము!! గురుజనముపై సీతని కున్న భక్తి ప్రేమలు ధర్మాచరణమునుండి యీతనిని పదచ్యుతుని జేయజాలక పోయినవి. తన్నింతపాటు పఱచిన కైకేయిపై సైత మాతఁ డాగ్రహింపఁడు.

సోదరులయందును రాముని భ్రాతృత్వము ప్రశంస నీయ మైనది. తాను స్వధర్మము నాచరించినట్లు తన తమ్ముల చేతను దాని ననుసరింపఁ జేసినాఁడు. రామునకు లేని రాజ్యము తన కేల యని భరతుడు పెడమొగముపెట్టి రామునివద్దకు వచ్చినపుడు రాముడు భరతునితో నాడినవాక్య ముల నాలింపుఁడు. "నాయనా! భరతా! చంద్రుడు తన శోభను విడిచిన విడుచుఁగాక. హిమవంతుడు శైత్యమును గోల్పడినఁ గోల్పడుఁగాక. సముద్రము చెలియలికట్టను దాఁటిన దాటుఁగాక. నేనుమాత్రము పితృపాదుల ప్రతిజ్ఞను వృథ చేయను. నీ తల్లియగు కైక పుత్త్రప్రేమచేఁగాని రాజ్యలోభముచేఁగాని యీపని చేసియుండవచ్చును. అందుకై నీవామెను తెగనాడవలదు. తల్లివలెనే యామెను గౌర వింపుము."

ఈ విధముగా కుటుంబసభ్యులచే ధర్మము ననుసరింపఁ జేయుట అసాధారణ విషయము కాదా? సత్యప్రతిజ్ఞుఁడగు రాముని యౌదార్యము లోకోత్తరమయినది. విభీషణుఁడు తన్ను శరణు వేడినప్పుడు. "రావణునిజంపి లంకారాజ్యమున కాతని పట్టాభిషిక్తు నొనర్తు"నని రాముడు మాట యిచ్చెను. అట్టితఱి సుగ్రీవుఁడు "ప్రభూ! రావణుడు తన తప్పు తానెఱింగి పశ్చాత్తప్తుడై సీతాదేవిని నీకర్పించి శరణువేడినచో అప్పుడు నీవేమి చేయఁగలవు? లంకారాజ్యము రావణునకే యుండును గదా? విభీషణునకేరాజ్యము నర్పించి వాగ్దానమును జెల్లించుకొందువు?" అని ప్రశ్నించెను. ఆ సమయమున మహౌదార్య శాలియగు రామచంద్రుడాడిన వాక్యములివి.

> అనఘచరిత్ర మీకు శర
> ణాగతరక్ష కులవ్రతంబు, మీ
> సునిశిత బాణ జాలముల
> చోకున కోర్వక వచ్చి తా దశా
> ననుఁ డభయంబు వేడికొని
> నం దగ వెల్లగునన్న నవ్విభుం
> డినసుతుఁ జూచి యట్లయిన
> నిచ్చెద వాని కయోధ్య యంచనెన్.

—భాస్కర రామాయణము.

ఇట్లు వాగ్దానమును జెల్లించుకొన స్వరాజ్యమగు నయోధ్యనేని త్యాగము సేయజాలుట రామభద్రునకే

తగును. రాముని సత్యధర్మపరాయణత యట్టిది. పరోపకార మునకును, లోకసేవకును, రాజ్యమునువీడుట ఆదర్శ భార తీయ వీరుడగు రామునికొక లెక్కలోని పనికాదు. రావణ వధానంతరము పట్టాభిషిక్తుడయిన రామచంద్రుడు లోకము కోసము ప్రాణాధికమైన సీతనుగూడ త్యాగము చేసినాడు కదా మఱి. "స్నేహమును, దయను, సౌఖ్యమును, కడకు జానకినైననుసరియే లోకారాధనముకోసమై త్యాగముసేయుచు వ్యథ చెందను" నని పలుకుటకు రామచంద్రునికే తగిపోయినది. ఆతని త్యాగ మట్టిది.

ఇట్టి గుణములుగల శ్రీరామునకుఁ దగినపత్నియే సీతామహాసాధ్వి. సత్త్వగుణప్రధానయగు సీత—మహారాజర్షి యగు జనకుని కూఁతురగు సీత ఉభయవంశములకుఁ బేరుతేఁ జాలిన యుత్తమ భారతీయగృహిణియై తేజరిల్లినది. హృద యేశ్వరుఁ డడవులకుఁ బయనమగుచున్నప్పుడు సీతాసాధ్వి అయోధ్యలోనుండి హాయిగా కాలముపుచ్చుట కియ్యకొన లేదు. పతితోడిదే లోకమని యెంచి చంద్రుని వెన్నంటు చంద్రికవలె సీతాదేవి రామచంద్రుని వెంట నడవులకు పయనమైనది. సీతకు భర్తృవిరహము దుస్సహము. రామున కును సీతావిరహము దుస్సహతరమే. కావుననే సీత నుద్దే శించి "ఈమె నాగృహలక్ష్మి. ఈమె నానయనముల కమృత వర్తి. ఈమెస్పర్శ శరీరమునకు మంచిగంధపుఁ బూఁత. కంఠ

లగ్నమగు సీమె బాహువు చల్లఁదనము నొడఁగూర్చు ముత్యాలసరము. ఇంతి యేల? ఒక్క విరహముతక్క, సీతా సంబంధమగు న దంతయు ప్రియమే” యనుచున్నాఁడు.

సీతారాముల యద్వైత ప్రేమము వాగర్థములను, పూవుదావులను బోలిన పార్వతీ పరమేశ్వరుల గాఢానురాగ రసమున కే వన్నెతెమును దీసిపోనిది. పదునాలుగు సంవత్సరము లరణ్యవాసములో నష్టకష్టములతో వేగింపవలసి వచ్చినను వారిప్రేమ నిర్వికారమై, నిరుపమానమై వన్నె కెక్కినది. సర్వావస్థలలోను సుఖదుఃఖములయం దద్వైత స్థితిని గాంచి, హృదయమునకు విశ్రాంతిని గూర్చుచు ముసలితనమునందును రసభంగమును బొందక అతి భౌతికమైన దివ్యప్రేమసారముగా పరిణమించినది. సీత పలుకులు వాడిపోయిన రామజీవిత కుసుమమునకు వికాస కారణములు. సకలేంద్రియ మోహనములు. చెవుల కమృత ప్రాయములు. మనోరసాయనములును.

చెట్లను, పశుపక్ష్యాదులను, మృగములను బంధుమిత్రులనుగా నొనర్చుకొని చేసిన దడవి కాపురము, పర్ణశాలానివాసము. కొండలయందు, కోనలయందు విహారము. అయిన నేమి? అవి యన్నియును సీతారాముల కసాధారణములైన దివ్యభోగములుగానే పరిణమించినవి. ఇందుకుఁ గారణము వారి హృదయములందుఁగల ప్రేమమహత్త్వము.

ఆ మహాటవులలో పుత్త్రీభూయిష్ఠమైన లక్ష్మణుడు సేవ చేయుచుండగా గోదావరీ మధుర సలిలములను పానము చేయుచు, తన్నదీ సైకతములం బ్రొద్దుబుచ్చు సీతారామ మిథునము బాహ్యప్రకృతిలోని సౌందర్యమును వివిధీతం గ్రోలి, హార్దికమగు సంశుద్ధప్రేమతత్త్వము నారాధించి కృతార్థమైనది.

ఆసక్తి యోగపరాయణులై ఏవేవో ప్రేమోపనిష ద్రహస్య సిద్ధాంతములను ముచ్చడించుకొనుచు నొకరి కౌఁగిళ్ళలో నొకరు కరగిపోవుచున్న యీ పుణ్యదంపతుల కెన్ని రాత్రులు దండకారణ్యములో గడచిపోయినవో. శిశిర మనోహరమగు జానకీస్పర్శము కలిగినప్పుడు రాముఁ డది సుఖమో, దుఃఖమో నిశ్చయించుకొనలేఁడు. మూర్ఛయో, నిద్రయో గ్రహింపఁజాలఁడు. విషవ్యాప్తియో, మత్తో యెఱుఁగఁజాలఁడు. సర్వేంద్రియములును సమూర్ఛితములు కాఁగా నొకానొక దివ్యవికార మాతనిని సముల్లసితుని చేయును.

"నీవు నా జీవితమవు. నా రెండవ హృదయమవు. నా కన్నులకు వెన్నెలవు. నా శరీరమున కమృత రసమవు." అని రాము డామెను ప్రేమించినాఁడు. ఏకపత్నీవ్రతుఁడగు రామచంద్రుఁడు ఆదర్శ గార్హస్థ్యమును లోకమునకుఁ జాటినాఁడు "స్వాపహేతు రనుపాశ్రితోఽన్యయా రామ

బాహు రుపధాన మేష తే" "అన్యస్త్రీ తాకుటకు వీలుకాని రామబాహువు నీకు తలాపియగుగాక" అనుట రామునివంటి యేకపత్నీవ్రతున కే సాధ్యమయినది.

స్త్రీమాత్రము భర్తృపరాయణలై పతివ్రతలైయున్న చాలుననియు, పురుషుఁ డెట్లు ప్రవర్తించినను చెల్లుబాటగు ననియు నీ కాలమున కొందఱు తలంపవచ్చును. అది పొర పాటు. స్త్రీకి పాతివ్రత్య మట్లు పురుషునకును ఏకపత్నీవ్రతము ఆచరణీయము. త్రికరణములచే పురుషుడు సైతము పరస్త్రీ విముఖుడుగా నుండవలయుననుటే వైదిక ధర్మము. "ధర్మేచ అర్థేచ, కామేచ నాతిచరామి" అని వివాహ సమయమునఁ జేయు ప్రతిజ్ఞ యీ యంశమునే స్పష్టము చేయుచున్నది. ఈ మహాదర్శమును రామచంద్రమూర్తి ఆచరించి చూపినాడు. తరువాత మనుచరిత్రలోని ప్రవరునియం దిట్టి శీలమునే కాంచఁగలము. అనుకూలవతియై మనసులో వర్తించు సోమిదేవమ్మను దప్ప ఆతఁడు పరస్త్రీని కన్నెత్తి చూడడుగదా! కావుననే వాని చక్కదనము కామిని మధుకరులకు సంపెంగ పూవైనది.

సీత రామమయజీవిత. ఓర్పులో నామె భూదేవి కూతురే. పరిశుద్ధి విషయమున నగ్నిసదృశ. కావుననే యామెను పావకుడును జెనక వెఱచినాడు. సీత మహనీయు రాలని భూమియు, అగ్నియు, గంగయు, అరుంధతియు,

రఘుకులగురుడగు భాస్కరుడును స్పష్టముగా నెఱుంగుదురు. అయిననేమి ? ఆమెకు ఆడికలు తప్పలేదు. నిలుగులు వెంట నంటినవి. అయినను మహాపవిత్ర గదా యాసాధ్వి. సీతా శీలము నరుంధతి యిట్లు పొగడినది—

"నీవు వయస్సున చిన్నదానవైనను, పెక్కువిషయ ములందు నాకు శిష్యురాల వైనను నీ పవిత్రత నాకు నీయందు భక్తిని గలిగించుచున్నది. నీ యందలి స్త్రీత్వాదులకేమిగాని గుణములచే లోక వంద్య వయినావు." అని గుణములకు పూజ్య స్థాన మిచ్చి యరుంధతి మెచ్చుకొనుట సామాన్యమా?

రామాయణములో సీతకెందును దీసిపోవని సచ్చరిత్ర ఊర్మిళ. ఈమె సీతకన్న మిన్నగా పాతివ్రత్య ప్రభావమును బ్రకటించిన దనవలయును. సీతభర్తృవిరహమును సహింపఁ జాలక ప్రాణేశ్వరునితోనే యష్టకష్టములను బడుటకు సంసిద్ధ యైనది. హైందవ స్త్రీలకు పతియున్న నన్నియు నున్నట్లే! పతి లేకున్న నన్నియు నుండియు లేనట్లే. ఇట్టి స్థితిలో నూర్మిళాతన్వి దుస్సహమైన భర్తృవిరహమును పదునాలు గేండ్లు సహించినది. మగని నెడఁబాసియుండు ప్రోషిత పతిక లగు స్త్రీలు నెరపవలసిన వ్రతచర్య మిక్కిలి తీక్ష్ణమైనది. వా రలంకరించుకొన రాదు. ఇష్ట మృష్టాన్నములఁ గుడువ రాదు. శరీర సౌఖ్యములను బాటింపరాదు. జీవితసర్వస్వ మైన నాథుని రాక కెదురు చూచుచు దినములు రాత్రులు

దుస్సహమైన విధురజీవితమును బుచ్చవలయును. క్రొత్తగా కాఁపురమునకు వచ్చి సకల భోగముల ననుభవింపవలసిన నడియౌవనములో నూర్మిళాదేవి యీ వ్రతము నద్భుతముగా నడపినది. ఇట్టి యూర్మిళ హైందవ స్త్రీ సమాజమున కాదర్శ ప్రాయమై తన చరిత్రను చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁ జేసికొన్నది. కావుననే సీతకన్నను నూర్మిళయే మిన్నయని కొందఱు తలంచెదరు.

రామచంద్రుని కుటుంబములోని భాతృత్వము ప్రశంస నీయమైనది. సకలసద్గుణ గుణాభిరాముఁడగు రామునియందు భక్తి నెఱపుటలోను, ఆతని యాజ్ఞను బాలించుటలోను భరత లక్ష్మణ శత్రుఘ్నులు సాటిలేనివారు. కైక రామవన వాసమును గోరినదేకాని, లక్ష్మణునిగూడ నాతనివెంట పోవలసినదని కోరలేదు. అయినను రామసేవాపరాయణు డగు సౌమిత్రి బుద్ధిపూర్వకముగా నన్నగారి సేవకై బయలు దేఱినాఁడు. అన్న కావంత కష్టము వచ్చినను సైఁపని లక్ష్మన్న కైక తలంచిన రామాపచారమునకు క్రుద్ధుఁడయి నాఁడు. తన పరాక్రమమును జూపింపఁబూనినాడు. కాని ఆత నిని రామాజ్ఞ బంధించి వైచినది. పితృవాక్య పరిపాలనము నెఱపుటలో సోదరు లెల్లరును బాధ్యులేయని రామమూర్తి కర్తవ్యము నుద్బోధించినాఁడు. సౌమిత్రి నిరంతర రామసేవా

తపమున తాను ధన్యుఁడై లోకములోని భ్రాతృవర్గమున కుత్తమ ధర్మమును జాటి చెప్పెను.

లక్ష్మణునట్లు భరతుడును అన్నయెడ భక్తి ప్రేమలు నెఱపినాడు. తన తల్లి కోర్కె యాతనికి సహింపరానిదైనది. ఈ యకార్యము నాత డెంతగానో గర్హించెను.

రాముం బుణ్యగుణాభిరాము నెలమిం
ప్రార్థించి తోడ్తెచ్చి ది
క్సీమాతిక్రమణక్షమాన్వయ లస
త్కీర్తుల్ వెలుంగొందను
ద్దామ శ్రీకభిషిక్తుఁ జేయుదు; రఘూ
త్తంసంబురాకున్న నా
భూమీశాగ్రణిఁ గొల్చినిల్తు నటవీ
భూమిం దపోవేషినై.

—భాస్కర రామాయణము.

రాముఁడు లేని యయోధ్యకుఁ దానేగనని నందిగ్రామము ననే వసించి, రామపాదుకలనే సింహాసనమున నభిషేకించి రాజ్యము చేసిన భరతభక్తి యెంత ఘనమైనది! చేఁజిక్కిన రాజ్యము నిట్లు ధర్మపాశబద్ధుఁడై యనుభవింపక నిరీహుఁడై రామాజ్ఞను నెఱవేర్చిన భరతుని చరిత్రము సోదరులకెల్ల ననుసరణీయము రాదా? రామాయణ కావ్యమును బట్టి

సోదరీ సోదరసమృద్ధమగు భారతీయకుటుంబ మెట్లు నడచుకొని కృతార్థము కావలయునో వ్యక్తమగుచున్నది.

దుష్టనిగ్రహామునందును, శిష్టపాలనము నందునుగూడ రామచంద్రుడు చూపిన మార్గములు గణనీయములు.

రావణుడు చేసిన దసత్కార్యము. సాటి రాజగు రాముని భార్యను పరనారియను శంకగూడ వీడి యాతడు చెఱబట్టినాడు. విభీషణుడు మున్నుగు వారెన్ని చెప్పినను దశకంఠుడు వినలేదు. కడకు విభీషణునిగూడ తన్ని పంపి నాడు. ఈ దుష్కార్యములకు ఫలితముగా రావణుడు రామబాణహతుడై సర్వమును గోల్పోయెను. ఇట్టి పౌల స్త్యుడు తుదకు బావుకొన్న దేమియు లేదు. సుతులను, సోదరులను, బంధుగులను నందఱను బోకార్చుకొని శాశ్వత మగు నపయశస్సును మాత్రము మూటగట్టుకొన వలసిన వాడయ్యెను.

రాముడో సుగుణాభిరాముడై సత్యధర్మములకోసము రాజ్యమును సౌఖ్యములనుగూడ త్యాగముచేసి యధర్మ ముపై నఖండవిజయము సంపాదించి ఆదర్శగృహస్థుడై సత్సంతానమును గని ప్రజారంజకముగ రామరాజ్యము నెల కొల్పి రఘువంశమున కజరామరమగు కీర్తిని సంపాదించి మానవజగత్తున కనుసరణీయుడై యొప్పినాడు. వేయేల? ఎవ్వడు రామచంద్రమూర్తిని దర్శింపడో, రామచంద్రు

డెవ్వనిని చూడఁడో అట్టివాఁ డధన్యుఁ డని వాల్మీకి రామాయణములో వ్రాసియున్నాడు. ప్రజాసముదాయమున నింతటి ప్రసిద్ధిని బొందిన మహానుభావు డెంతటివాడు కాడు ?

మహావీరుడగు రామచంద్రు డింత మహనీయచరిత్రు డైనందుననే కవిలోకమున కీతనియితివృత్తము వర్ణనీయమైనది. మురారి కవిచంద్రుఁ డనర్ఘ్యరాఘవనాటకమును వ్రాయుచు 'రామచరిత్రము నిదివఱ కెందఱో కవులు వ్రాసినారని యూరకున్నచో నట్టి మహనీయగుణగరిష్ఠుడగు నాయకుఁడింకెవడు గలడు ? కవీశ్వరులు తమవాక్కుల నెవ్వని వరించి యెట్లు సార్థకము చేసికొందురు ?' అనినాఁడు.

రామచరిత్రమును పెక్కురు కవులు పెక్కుభాషలలో వ్రాసిధన్యులైరి. వారి కన్నింటికిని సంస్కృతములోని వాల్మీకి రామాయణమే మూలము. తరువాత భాసుడు, కాళిదాస భవభూతులు, మురారి మున్నగు కవులీచరిత్రమును కావ్యము గను రూపములుగను చిత్రించిరి. హిందీభాషలో తులసీదాసు రామాయణము ప్రసిద్ధమైనది. అరవములో కంబ రామాయణము వన్నెకెక్కినది. తెలుగున గోనబుద్ధారెడ్డి రంగనాథరామాయణము తొలిది. తరువాత భాస్కరుని రామాయణము చెప్పదగినది, ఇతరభాష లన్నింటిలోను రామాయణమునకు ప్రసిద్ధి ఎక్కువ. ఒక్క తెలుగులోమాత్ర

మా ప్రసిద్ధి భారతమునకు వచ్చినది. ఆ గౌరవము కవిత్వోన్న త్యమునుబట్టి కలిగినదే కాని వేఱుకాదు.

కావ్యప్రయోజనము

"కావ్యమువలన కీర్తి కలుగును. ధనము లభించును. వ్యవహారజ్ఞాన ముదయించును. చదువునపుడు నిరతిశయ మగు రసానందము జాయమాన మగును. ఇంకను కావ్యము కాంతవలె పాఠకు నలరించి సదుపదేశ మొనర్చును." అని ఆలంకారికులు నుడివియున్నారు.

ఆనందోద్భూతియనునది సర్వకావ్య సాధారణమైన ధర్మము. కావ్యము కళాప్రపంచములోనిది. జ్ఞానేంద్రియముల మూలమున మానవుని చిత్తవృత్తుల నాకర్షించి యానందము నొడగూర్చునది కళాప్రపంచము. నాట్యము, సంగీతము, కవిత్వము, చిత్రకళ, శిల్పము అనునవి లలితకళలలోనివి. ఈకళ లన్నియూ రసనిధానములు. రసభావముల నభివ్యక్తముచేసి మానవుల కానందము గూర్చుట కళలయొక్క ముఖ్య ధర్మము. "నవరసములలో శృంగార హాస్య వీరాదులచే నానందము కలుగవచ్చును. కాని శోకరసముచే నెట్లు కలుగును?" అని శంకింపవచ్చును. లలితకళలు అనుకరణాత్మకములు కాని, వాస్తవిక జగత్తులో స్వతస్సిద్ధమైనవి కావు. అటుట వాని నలౌకికములందుము. లౌకికజగత్తులో వ్యసనము

విదారకమగు కరుణాదృశ్యమును గాంచినప్పుడు మన కానందము కలుగదు. ఆ కరుణావృత్తమునే చిత్రకారుడు చిత్తరువుపై వ్రాసినప్పుడును, కవి కావ్యములో వర్ణించినప్పుడును మన మానందమునే యనుభవించుచున్నాము. ఆ కరుణ దృశ్యమును నాట్యాదులలో దర్శించునప్పుడును, కావ్యములో చదువునప్పుడును మనకుఁ గన్నీళ్ళు మున్నగు శోకచిహ్నములు గలిగినను హృదయములో ననుభూతమగు న దానందమే. ఆ యనుభవ మానంద స్వరూపమగుటకుఁ గారణము రసమలౌకికమగుట. లోకసిద్ధములగు శృంగారాదులు మనకు రాగద్వేషాదులను గలిగించును. కళాగతములగు శృంగారాదు లొక్క యానందమునే యొదవించును.

కళ లన్నింటిలోను గావ్యకళ విశిష్టమైనది. అది శబ్దార్థ రస స్వరూపమున మహోత్కృష్టభావములను బోధింప సమర్థమగుచున్నది. కావ్యము రసపానజనితానందము ద్వారముననే మానవులకుఁ గర్తవ్యోపదేశమును సులభముగాఁ జేయగలుగుచున్నది. కొందఱు "కళలయొక్క పరమప్రయోజనము కళాసిద్ధియే" యనియు, నానంద ప్రదానము మాత్రమే యనియు నందురు. ఆనందజనకత్వము కళలకు ప్రధాన ప్రయోజనమైనను ఉపదేశముగూడ ప్రయోజనములలో నొకటియనుటను మఱువఁగూడదు. అందుకే యాలంకారికులు కావ్యప్రయోజనములను నిర్వచించుచు "సద్యః పరనిర్వృతి"

తోఁబాటు ఉపదేశాదులను గూడ ప్రయోజనములుగా నిర్వచించినారు. ఆనందముతోఁబాటు సదుపదేశమునుగూడ చేయుట సత్కళలయొక్క పరమార్థమగును. కేవలానందము నొడఁగూర్చి, యుపదేశము సేయఁజాలని కళచే సమాజమునకు లాభము లేదు. అట్టి కళ కళగా లెక్కింపఁబడినను ఉత్తమోత్తమమగు కళగాఁ బేరొందఁగాదు. కావ్యకళలో నిట్టి సదుపదేశ రూప ప్రయోజన మగ్గలముగా నుండవలయును. అట్టి సదుపదేశకళశక్తి లేని కావ్యములను మనవారు అసత్కావ్యములనుగా పరిగణించినారు. అట్టివానిని గూర్చియే "కావ్యాలాపము సేయరాదని" ధర్మశాస్త్రకారులు నిషేధించినారు గూడను.

రామాయణ కావ్యముచేఁ గల్గు నుపదేశ రూపప్రయోజనము మిక్కిలి గొప్పది. రాముని పితృవాక్య పరిపాలనము, ఏకపత్నీవ్రతము, స్నేహానురక్తి, ప్రతిజ్ఞాపాలనము, శిష్టరక్షణము, ఔదార్యము మున్నగు మహాగుణములు మన కనుకార్యము లగుచున్నవి. సీతామహాదేవి పాతివ్రత్య మహిమ, కష్టసహిష్ణుత, ఆదర్శగృహిణీధర్మ నిర్వహణము. పుత్రవాత్సల్యము, సఖీప్రేమ మున్నగు నుదాత్తధర్మములు స్త్రీ జనము నుద్ధరింపఁజాలుచున్నవి. ఇంకను భరతాదుల భ్రాతృ ప్రేమ, లక్ష్మణుని సేవాదీక్ష, ఆంజనేయాదుల భక్తి ప్రపత్తులు, సుగ్రీవుని స్నేహధర్మము, విభీషణుని యాత్మ ధర్మ నిర్వహణము,

దశరథుని పుత్త్రప్రేమ మొదలగు గుణము లెందఱినో తీర్చిదిద్ద జాలుచున్నవి.

రామపక్షముననున్న సత్పురుషుల నడవడు లాచరణీయము లైనట్లు, ప్రతిపక్షముననున్న రావణాదులచర్యలు ననాచరణీయములై మన బుద్ధులను సన్మార్గమునకుఁ ద్రిప్పుచున్నవి. కావ్యముచేఁ గలుగవలసిన హితప్రవృత్తి, అహితనివృత్తియను ఫలము లీ కావ్యముచే నధికముగాఁ గలుగుచున్నవనవలయును. అందువలన నీయాదికావ్య మన్నివిధముల నందఱిచేతను ఆదరింపఁదగినదై యుత్తమోత్తమ సత్కావ్యమను పొగడ్త కెంతయేనియుఁ దగియున్నది.

కావ్యములో నా యా యుపదేశము వాచ్యముగాఁ జెప్పఁబడఁగూడదు. అయ్యది వ్యంగ్యముఖముననే వ్యక్తము కావలయును. పారదార్యము అకర్తవ్యమను విషయము వాచ్యముగా గాక చరిత్రవర్ణనముతో నిందు వ్యంగ్యముగా నుపదేశింపఁబడినది. అట్లే పితవాక్పరిపాలనము, పాతిప్రత్యము, భ్రాతృప్రేమ మున్నగు నాదర్శములును వాచ్యములుగాఁగాక వ్యంగ్యరూపమున బోధింపఁబడుట కావ్యము నందలి విశేషము. వాచ్యబోధ సూటిగా హృదయమునఁ జొరకపోవచ్చును. కాని వ్యంగ్య ధర్మము ననుసరించి కలిగెడి యీ కర్తవ్యోపదేశము హృదయమును ఆర్ద్రమొనర్చి మానవుల నప్రయత్నముగనే యాచరణోన్ముఖులను జేయు

చున్నది. అందుకే కావ్యములోని రసముగాని, భావముగాని, సందేశముగాని వ్యంగ్యమయిననే యది యుత్తమ కావ్య మగునని యాలంకారికులు నిర్వచించియున్నారు.

## ఆంధ్రీకరణము

వాల్మీకిరామాయణమును మొట్టమొదట తిక్కన సోమయాజి తాతయగు మంత్రి భాస్కరుడు తెనిగించినాఁడని చెప్పుదురు. ఆతఁడు తెనిగించి నందువలననే దానికి భాస్కర రామాయణమని పేరువచ్చినదట ఇప్పటి భాస్కర రామా యణములోని ఆరణ్యకాండ మా మంత్రి భాస్కర ప్రణీత మనియుఁ జెప్పుదురు. ఈ వాదము సర్వజనామోదమనుటకు వీలులేదు. మంత్రి భాస్కరుని రామాయణము శిథిలమై ఆరణ్యకాండము మాత్రమే మిగిలినదని కొందరి మతము. ప్రస్తుత మగపడుచున్న భాస్కరరామాణము మల్లి కార్జునభట్టు, కుమార రుద్రదేవుడు, హుళిక్కిభాస్కరుఁడు, అయ్యలార్యుఁడు అను నల్వురు కవులు రచించినట్లగపడు చున్నది. ఈ భాస్కరాదులకంటెను మొట్టమొదట రామా యణమును ద్విపదరూపముగాఁ దెనిఁగించినవాడు గోన బుద్ధా రెడ్డి. ఆతడు తన తండ్రియగు రంగనాథునికి ప్రతిష్ఠను సంపా దించుటకై "రంగనాథ రామాయణ" మనుపేర తెనుగు చేసెను. గోన బుద్ధారెడ్డి రామాయణములో వాల్మీకి రామా యణమున లేని కల్పన లెన్నియో కలవు. ఆతని కవితా

శైలియు, వర్ణనాదులును, పాత్రచిత్రణాది కావ్యశిల్పమును సహృదయుల సంస్తుతులకుఁ బాత్రములైనవి. తెలుగు దేశపు తోలుబొమ్మలవాండ్రు బొమ్మలనాడించునప్పు డీ రంగనాథ రామాయణములోని ఘట్టములనే పాడుచు బొమ్మల నాడింతురు. కాని ద్విపద కావ్యములందు మన పండితులకుగల యనాదరణముచేత గోన బుద్ధారెడ్డి రామాయణమునకు రావలసినంత ప్రసిద్ధియు ప్రచారమునురాలేదు. ఆతుకూరి మొల్ల యను నొక కులాలస్త్రీగూడ, రామకథను "మొల్ల రామాయణ" మనుపేర కావ్యముగా రచించెను. ఇంకను గోపీనాథుడు మున్నగువారుకూడ రామాయణమును దెనుఁగుచేసిరి.

ఆధునిక కవులలో శ్రీ వావిలికొలను సుబ్బారావు, జనమంచి శేషాద్రిశర్మ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారలు గూడ రామాయణము నాంధ్రీకరించిరి. ఎవరెన్ని గతుల రామాయణము నాంధ్రీకరించినను భారత కవిత్వమువంటి కవితలో నది రూపొందలేదు. బహుముఖ ప్రజ్ఞగల శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు "రామాయణ కల్పవృక్షము"ను వ్రాయుచున్నారు. వీరి యీ మహాకావ్యముపై పెక్కురు సహృదయుల కాశలున్నవి. రామాయణమును మహనీయ కవిత్వ శోభితముగా నీను దిద్ది తీర్చగలరని ఆంధ్రలోక మాశించుచున్నది. ఆంధ్రములోని వీరి రామాయణమునకు

ఆంధ్రభారతమున కున్న స్థానములభించునేమో చూడవలసి యున్నది.

మున్ముందు ప్రస్తుతము ప్రచారములోనున్న భాస్కర రామాయణమునందలి కొన్ని పద్యములను జదువు కొందము. భాస్కర రామాయణ కవిత్వము కవిత్రయమువారి కవితతో దులఁదూఁగదు, పోతనకవితకుఁ దరువాతి స్థానమిద్దాని కీయ వచ్చును. కవిత్రయకవిత్వము మొదటి తరగతి యగుచో, పోతన్నది రెండవతరగతికిని, భాస్కరాదులది మూడవతరగతికిని వచ్చును. ఇంకను మొదటి తరగతికి వచ్చువారు నాచన సోమ నాథాదులును, రెండవ తరగతికి వచ్చువారు శ్రీనాథాదులును గలరు. అయినను ఆ విమర్శ యిచ్చట ప్రధానముగాదు.

భాస్కరాదులు గూడ సమాస భూయస్త్వమును సంస్కృత భూయిష్ఠతనుగూడఁ జూపియేయున్నారు. అవసర మయినప్పుడలఁతి యలంతి పదములతో పద్యముల నల్లినారు గూడను. విభీషణుడు రావణునకు హితము బోధించుపట్టున నీపద్యముంగనుడు.

> తాత పులస్త్యుడుం గనిన తండ్రియు విశ్రవసుండు వైదికో
> పేతము నిర్మలాచరణ మీవును బ్రహ్మవు చెప్పవచ్చినన్
> నీతి వివేకముల్దొఱఁగి నిందకునోర్చితి వేలదేవ! ము
> న్నీ తెఱఁగెల్ల నొప్పదని యీవయెఱుంగుదు చెప్పనేటికిన్?

రావణుడు సీతను దెచ్చుట తనకు చేటుదెచ్చుకొనుటే! ఈ యర్థమును కవి మనోహరముగా వర్ణించినాడు—

నీ కంఠార్పిత కాలపాశము, శిరో నిర్ఘాతపాతంబు, లం
కాకస్సంచయ కాళరాత్రి, గళబద్ధోదగ్ర కాలాహి, క
న్యాకారాగత మృత్యువుం జనక కన్యన్వేగ నొప్పించి లో
కైకత్రాణుని రాముని౦గనుము నీకీ బుద్ధిగాకుండినన్.

భాస్కరుడు లా యా రసముల నొప్పించుటలోను అందెలు వేయించుకొన్న చేతులే. భరతుడు చిత్రకూటమునకు వచ్చి మునివేషధారియైన యన్ననుగాంచి విలపించు ఘట్టము లోని యీ పద్యము సౌందర్యము నారయుడు—

“మహనీయ మణిమయ మందిరంబులనుండు
ప్రభుడు నేడున్నాడు పర్ణశాల
మెత్తని పాన్పుపై మేనొత్తు సుఖినేడు
తనువు సేర్చినవాడు దర్భశయ్య
లలితమాల్యంబులు లలిఁబూను పతి నేడు
వలనొప్ప గయికొన్న వాడు జడలు
మృదులాంబరంబుల మెఱయు పుణ్యుడు నేడు
వలనొప్ప గట్టెను వల్కలముల
కోరి రాజన్యలోకంబు గొల్చురాజ
మౌళిమణి నేడు మునిసేవ మరగినాడు
వలసె నాకిపు డీ దురవస్థ చూడఁ
గైక కడుపునఁబుట్టిన కారణమున.

ఈ పద్యములో జనసామాన్యముయొక్క "అంతవాని కిట్టిపాటా" యను నుడికారము మూర్తిదాల్చినది. కైక కడుపున బుట్టిన కారణమున దా నీదురవస్థ చూడవలసెనను మాట గుండెలను గదలించుచు కైకమ్మ చెడ్డతనమునకు నిదర్శనమైనది.

విభీషణ బోధలోని యీ దిగువపద్యము రూపకాలంకారములో నిమిడి సుందరమై యొప్పినది. సంస్కృతభూయిష్ఠత పద్యమున కొకసొంపు చేకూర్చెను—

"జ్యా ఘోషంబు నిరంతరంబగుచు ప్రమోయం బెల్లుదంభోళి ధా
రా ఘోరాస్త్ర పరంపరల్ దరఁగలై రాజిల్ల వాఃపూరితా
మోఘావృత్తిఁ దనర్చు రామ ధనురంభోరాశి దోర్విక్రమ
శ్లాఘాగాధము నేఁడు ముంచుఁ బెలుచన్ లంకాపురీ ద్వీపముగా.

భాస్కరరామాయణము సంస్కృత వాల్మీకి రామాయణములోని యారు కాండములకు మాత్రమే తెనిగింపు. ఏడవదగు నుత్తరకాండమును కంకంటి పాపరాజ ప్రధానుడు తెనుగు చేసినాడు. ప్రబంధకవులకు పిమ్మటివాడగు నీతడు తన రామాయణమును ప్రాబంధికధోరణిలో నడిపించినాడు. రచన సంస్కృత బంధురమై శబ్దార్థాలంకారములతో నిండియుండును. తిక్కనాదులలోని భావపుష్టి, రసప్రాచుర్యము ప్రబంధయుగమునాటికే తగ్గినది కావున ఈతని కావ్య మిట్లు తయారగుట యాశ్చర్యముకాదు.

అయినను పాపరాజు కవిత హృద్యమే. ఆయాఘట్టములు హృదయమును గదలింపజాలియుండును. ఈ యుత్తర రామాయణమును మన గ్రామములందు వీధిపురాణముగా జెప్పించుకొనుచు తెనుగువారు వేడుక పడుచుందురు. ఉత్తర రామాయణములో సీతా వనవాసఘట్ట మద్భుతముగా నుండును. పాపరాజు సీతాపాత్రమును లోకోత్తరముగాఁ బోషించి హైందవ సతీధర్మమునకు మెఱుగులు దిద్దినాడు. వనవాసమున కేగుసీత అపశకునంబుల కులికి పలుకు నీపలుకు లెంతగా పతిభక్తిని వ్యక్తము సేయుచున్నవో చూడుడు—

"ధవునెడఁబాసి వచ్చు తెరుదారికి నాకిక వంతయేల ? ని
య్యపశకునంబులం బొదలు నాపదలన్నియు మాన్పి రామ భూ
ధవునకు నీవు నత్తలకుఁ దక్కిన బాంధవ పౌరకోటికిన్
వివిధ శుభంబు లీవలయు వేల్పులటంచు నమస్కరించినన్."

సుశీల యగు జనకజ తనకు రామాజ్ఞను నివేదింప వెలిగందుచున్న లక్ష్మణుని విన్నబాటును, కన్నీటిని గాంచి—

"అడవినిదొల్లి శ్రీదొలఁగి యన్ననుగొల్చుచు వచ్చునప్పుడున్
గడుసరి యింద్రజిత్తుని ముఖాముఖిఁ గయ్యము సేయునప్పుడున్
జడుడగు రావణాసురుని శక్తియురంబున నాటునప్పుడున్
బొడమదు కంటినీరిపుడు పుట్టిన దేలకొ తండ్రి తెల్పవే?"

ఈ పద్యములో కవి సీతాపాత్రముతోబాటు లక్ష్మణపాత్రమును గూడ నద్భుతముగా పోషించినాడు. రావణుని

శక్తిబాణమునకన్నను సీతాసాధ్వికీవార్త జెప్పుట అతనికి బాధాకరముగా నున్నది.

రామాజ్ఞనువిన్న సీత పొందెడి దుఃఖమునకు ఱాలు సైతము కరగిపోగలవు. సంస్కృతములో కరుణకవి భవభూతి వజ్రహృదయము ద్రవ్యయ్యలగునట్లు శోకము నుపవర్ణించి పేరందినాడు. పాపరాజును ఈఘట్టమున గెలుపొంది తెలుగు వారి మన్ననలకు పాత్రుడయినాడు. ఒండు రెండు పద్యము లను మాత్రము చవిచూతము.

"ఎడపక పూర్వజన్మమున నే మిథునంబులఁ బాయఁజేసి వా
రడలగ నవ్వుచుండితినొ యాఫలమూరక పోనె నాడు కా
ఱడవుల రామపాదజల జాప్తి వసించితి, నేడు నాథు పొం
దెడసి యనాథనై యిచట నేగతి మేనధరింతుఁ బ్రాణముల్."

"ఎన్నఁటికిన్ రఘూద్వహుని నేనును నన్నిక రామచంద్రుడున్
గన్నులఁ జూడఁ గల్గదొకొ కల్గక యుండినఁ బ్రాణమేల పో
దన్న రఘుప్రవీరు చెవులారగ నింతయుఁ దెల్పు నాడు మే
నున్నది చెంత గంగమడు వున్నది యైనటులయ్యెడిం దృఢిక్."

సీత పూర్వానుభూతమగు ప్రియానురాగమును స్మరించు నీ పద్యమును వదలజాలము—

"ఒడిమీద నిడుకొని యురముపైఁ జేర్చుట
చేరిక కది కడసారియేమొ,
చెక్కుఁజెమ్మట చేల చెఱఁగునఁ దుడుచుట
చెలిమికి నది తుది చేటి యేమొ,

పుక్కిటతావి కప్పుర వీడె మిచ్చుట
యనురాగమున కతి యవధియేమొ,
కోటనపని కియ్యకొను టది కరుణా ప్ర
బంధమ్మునకు ఫలగ్రంథమేమొ,
మోము మోమునఁ గదియించి ముద్దుగొనుట
యదియె మోహంపుఁబనికిఁ దీయుదలయేమొ
యెలనగవుదేరఁ జూచి లోపలి కనుచుట
మేలుచిన్నెల కది పొలిమేర యేమొ.

ఇందు తెలుగువారి పోడుములు మదికెక్కునట్లు సీతా రాముల పూర్వానుభూత శృంగారవిశేషములు వర్ణింపబడి మనోహరములై తనరారినవి.

ఆంధ్రమున పెక్కు రామాయణములు వెలసినను మొల్ల రామాయణమునకు ప్రత్యేక ప్రసిద్ధి గలదు. ఇందుకు ప్రథమ కారణ మీామె వనితామణియై కవయిత్రియగుట; అందును విద్యావకాశములు బాగుగలేని కుంభకారవంశమున నీమె జనన మొందుటయు. కృష్ణరాయలయుగమునకుఁ జెందిన యీా కవయిత్రి ఉత్తమ కవితావేశముతో రామాయణమును సంగ్రహముగా తీర్చిదిద్ది రసజ్ఞామోదమునే కాక సామాన్య ప్రజామోదమును గూడఁ బొందినది. విస్తారమగు రామకథను అతిస్వల్పకాలములో పఠించి రసానందము నందవలెనన్న స్త్రీ బాలపర్యంత ముపకరించునట్టిది మొల్లరామాయణము.

మొల్ల శైవసంప్రదాయమునకు చెందిన రచయిత్రి. గురులింగ జంగమార్చన పరుడగు ఆతుకూరి కేసనసెట్టికి జనించిన యీమె శైవసహజమగు కరుణాహృదయమును బ్రకటింపజాలినది. పోతనవలె సహజపాండిత్యమున నొప్పిన యీ కవయిత్రి గోపవరపు శ్రీకంఠమల్లేశు వరముచేతఁ గవిత్వము చెప్పనేర్చినదట. మొల్ల తెలుగుకవిత్వమును గూర్చి యిట్లనుచున్నది—

"తేనెసోక నోరు తీయనయగురీతి
తోడనర్థ మెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములనుగూర్చిన కావ్యమ్ము
మూఁగచెవిటివారి ముచ్చటగును.
"కందువ మాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుగునకుం
బొందై రుచియై వీనుల
విందై మతికానుపించు విబుధుల మదికిన్."

దీనిం బట్టిచూడ గూఢశబ్దములతో కావ్యము వ్రాయుట మొల్ల కిష్టముకాదనియు, కందువమాటలను సామెతలను బొందించి సుందరముగాజెప్పుట వీనులవిందని యామె యభిమతమనియుఁ దెలియుచున్నది. కావ్యారంభమున కొన్ని పద్యములలో శ్లేషాద్యలంకారముల నుప నిబంధించినను, కావ్యమునందంతటను మొల్ల తన ప్రతిజ్ఞనే పాలించిన దనవలయును. దిగువ పద్యములో రామమహిమము నెట్లు వర్ణింపఁ జాలినదో చూడుడు.

"సల్లలిత ప్రతాపగుణ సాగరుఁడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైన రామ నరపాలకునికా స్తుతిచేయు జిహ్వకా
జిల్లర రాజలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే ?
అల్లము బెల్లముండినుచు నప్పటి కప్పటి కాసనేయునే?"

సీతాదేవిని రావణు డెత్తుకొనిపోయిన పిమ్మట రామచంద్రుడామెకై పరితపించు ఘట్టములోని యీ పద్యము సుందరమై సీతారాముల ప్రేమ మాహాత్మ్యమున కొలబడి ఆయియై యొప్పుచున్నది.

"వనజాస్య నినుఁగూడి వర్తించు నతిఘోర
వనములు శృంగార వనములగును
పడతి నీతోఁగూడి పవళించు కర్కశ
శయ్యలు పూవుల శయ్యలగును
కలకంఠి నీచేతి కందమూలాది భో
జనములు మధుర భోజనములగును
హరిమధ్య నినుగూడి చరియించు నటువంటి
తపములు సత్పుణ్య తపములగును
కొరలి నీతోడఁగూడి భోగించునట్టి
భోగమంతయు దేవేంద్ర భోగమగును
సుదతి పొడకట్టఁగదె నాకు జూడవలయుఁ
గన్నులకుఁ గానఁబడవేమి కమలనయన."

మొల్లకు నన్నయతిక్కనాదులమీద గౌరవము మెండు. వారి శైలిననుసరించి యీమె పెక్కు పద్యములను నడపి

సది. గురుశిక్షితమైన పాండిత్యము లేకున్నను, స్వప్రతిభా వశ మున పూర్వకవుల రచనల ననుసరించి తన కావ్యమును గుణవంతము చేసికొనుట సంతసింపదగినదే. విరాటపర్వములో తిక్కన ధర్మజునభివర్ణించు నీ పద్యముంగనుడు—

"ఎవ్వని వాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజినడఁగు
ఎవ్వని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
ఎవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానిత సంపద లీనుచుండు
ఎవ్వనిగుణలత లేడు వారాసుల
కడపటి కొండపైఁగలయఁ బ్రాఁకు
నతడు భూరిప్రతాప మహాప్రదీప
దూరవిఘటిత గర్వాంధకార వైరి
వీరకోటీర మణి ఘృణి వేష్టితాంఘ్రి
తలుడు కేవలమర్త్యుడే ధర్మసుతుఁడు."

పై పద్యమున కీడుగా మొల్ల తన రామాయణములో నీ దిగువ పద్యమును సృష్టిచేసి తిక్కన్నపై దనకుఁగల గౌర వమును బ్రకటించినది—

"ఎవ్వాని వీఁటికి నేడు వారాసులు
పెట్టని కోటలై పెచ్చుపెరుగు
నెవ్వాని సేవింతు రింద్రాది దేవత
లనుచర బలులయి యనుదినంబు

నెవ్వాని చెఱసాల నేప్రొద్దునుందురు
గంధర్వ సురయక్ష గరుడ కాంత
లెవ్వాని భండార మిరవొంద విలసిల్లు
నవనిధానంబుల వివిధభంగి
సకల లోకంబులును మహోత్సాహవృత్తి
నెవ్వనికిఁ జెల్లుఁ బుష్పకమెక్కి తిరుగ
నాకె తక్కంగఁ గలదె యేనాటనైన
మద్భుజాశక్తి ప్రతిపోల్ప నద్భుతంబు.

ఈ పద్యము రావణుడు సీతకు తన గొప్పదనమును ప్రకటించు ఘట్టములోనిది. ఇట్లే పెక్కు సందర్భముల మొల్ల కవిత్రయము వారి యడుగుజాడలలోఁ బయనించి తనకావ్యమునకు మెఱుగులు దిద్దుకొన్నది. పూర్వకవుల కవితా గుణమును తమ కావ్యములం దనుసరించుట మహాకవులకును సాధారణమైన లక్షణమే! అది దోషముకాదు.

మనము మాటలాడుకొను మామూలుమాటలను కవిత్వములో సుందరముగా పొదుగగలశక్తి మొల్లలో ప్రత్యేకముగా గలదు. కొందఱు కవులిట్టి పట్టుల తలక్రిందగుచుందురు. శివధనుస్సును విఱుచు సందర్భములోని యీ దిగువపద్యములో మొల్లచూపిన నేర్పుగనుడు——

"ఇది పర్వతాకార మీవిల్లు కనువిచ్చి
తేఱిచూడఁగ రాదు దేవతలకు
నటుగాక మును శేష కటకాని ధనువంట
హరుఁడు కాన లెఁగాక హరియుఁగాక
తక్కినవారికేఁ దర మె ఈ కోదండ
మెత్తంగఁ దగు చేవయొట్లుగలుగు
దీనిదగ్గఱ నేల దీనికోడగ నేల
పరులచే నవ్వులుపడగ నేల
గురుతు నేసియుఁ దమళావుకొలది దామె
తెలియవలెఁగాక యూరక తివుర నేల
యొరులసొమ్ములు తమకేల దొరకుననుచు
దలగిపోయిరి రాజనందనులు గనుచు."

ఈ పద్యము గూడ ద్రౌపదీ స్వయంవర ఘట్టములోని పద్యములను దలపింపక పోవుట లేదు. అయినను ఇందు ప్రత్యేకత యున్నది.

మొత్తముమీఁద మొల్ల కవిత్వముసరళమై మధురశబ్దములతో నిండి చదువువారి కింపు పుట్టించుచునుండును. తెలుఁగుబాస యున్నంతకాలమీమె రామాయణము జీవించి యుండగలదు.

ఆధునిక కవులలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి "రామాయణ కల్పవృక్ష" మెన్నఁదగినది, ఈ నవయుగ

ములో సత్యనారాయణగారివంటి మహాకవి ప్రాంతపురాణ మగు రామాయణమును వ్రాయుట పెక్కు రాంధ్రులు సహింపలేరు. అయినను సత్యనారాయణగారి సారస్వత నిర్మాణమార్గము ప్రత్యేకమైనది. ఆయన లోకముయొక్క రుచినే అనుసరించి కృతులు రచింపవలయునను సూత్రము నకుఁ గట్టువడు వ్యక్తికాడు. ఉత్తమరచయితకు లోకమునెట్లు నడిపింపవలయునో తెలియుననియు, ఆమార్గమున నారచయిత కావ్యవస్తువుల నెన్నుకొనుననియు వారిమతమయినట్లు కాన వచ్చును. కావుననే మురారి ప్రభృతులవలె తాను రామాయణమును పిష్టపేషణముగా వ్రాయుటలోని కారణము నిట్లు నిరూపించినాడు:—

"మఱల నిదేల రామాయణంబన్నచో
నీ ప్రపంచక మెల్లనెల్లవేళఁ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళ
తన రుచి బ్రదుకులు తనవిగాన
సేసినసంసారమే సేయుచున్నది
తనదైన యనుభూతి తనదిగాన
తలఁచిన రామునే తలఁచెద నేనును
నాభక్తిరచనలు నావిగాన
కవిప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశములయందుఁ గాంచబడియైనపాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతినిమించి."

తన రామాయణ రచనకు కవి మొట్టమొదట "లోకము తినుచున్న యన్నమే తినుచున్నది గదా" యని బిఱుసుగా సమాధానము చెప్పినను తుది గీతములో తన హృదయము నావిష్కరించినాడు.

మహాకవి వాల్మీకి మొట్టమొదట రామాయణమును వ్రాసినాడు. ఆ మహాకవి ప్రతిభా వ్యుత్పత్తులు, వర్ణనావిధానములు, కథాసంవిధానాదులు అందు వ్యక్తము లయినవి. దానిని తెనిగించిన పెక్కురు కవులా మార్గముననే యారీతులనే యనుసరించి రామకథను చిత్రించియున్నారు. ఒక్క రంగనాథరామాయణములో కొన్ని క్రొత్తపోకడలు, సంవిధానములు, కథలు కన్పట్టును. అట్లే సత్యనారాయణగారు తన లోకోత్తర ప్రతిభాపాటవమువలన నీ రామాయణ కల్పవృక్షమును సాహితీ కల్పవృక్షముగాఁ జేయ సంకల్పించినట్లున్నారు. అందుకే ఏ రామాయణమును మాతృకగా గైకొనక, కథాభాగమును మాత్రము మూఁగటాయిగా తీసికొని మహాశిల్పివలె పీ రీ కావ్యమును చిత్రింపఁ బూనినారు. అది యట్లుంచి చూచినచో తనకు రామభక్తి యగ్గలమని యీ కవి వచించుచున్నాఁడు. "జాగ్రదవస్థనేమి యన స్వప్నసుషుప్తులఁ గూడ రామనామ గ్రహణంబె నావయిన మానస జిహ్వాలు సేయు"నని. ఇంకను వారి సమాధాన మిది—

వ్రాసిన రామచంద్రుకథ వ్రాసితివం చనిపించుకో వృథా
యాసము గాక కట్టుకథ లైహికమా పరమా యటంచుఁ దా
జేసిన తండ్రి యాజ్ఞయును జీవుని వేసన రెండు నేకమై
నా సకలోహవైభవ సనాథము నాథకథన్ రచించెదన్.

కవికి పారమార్థికదృష్టి యొక్కువైనందువల్లనే-ప్రతిభా వ్యుత్పత్తులు గొప్పవయినందుననే యీ రామాయణము వెలయుచున్నది. ఆ పారమార్థిక దృష్టితోడనే యీ కావ్యము భగవదంకితమైనది. మఱియు మానవులు మెత్తురా లేదా యను నూహయు కవి తనకు లేదనుచున్నాడు.

"ఇది మెచ్చెదరో మెచ్చరొ
యిదియును జదివెదరుఁ జదువ రేలా నా క
య్యది? నాయెద మీతో రా
చెద నద్దానికి ఫలంబుఁ జెందించు శివా!

ఇది కొందఱు కవుల కుండు సాత్త్వికాహంకారము. కవి యే యభిప్రాయముతో నీ రామాయణమును వ్రాసినను ఆంధ్రప్రపంచమునకు మాత్రము పురాణ కల్పమగు మహాగ్రంథము లభించుచున్నది. మహాగ్రంథములు వేనకువే లుదయింపవచ్చును. కాని "వాని కాయుస్సెంత?" అనునది కవి ప్రతిభనుబట్టి యుండును. అగుగాక. రామాయణ కల్పవృక్షములోని కొన్ని పద్యములను హాయిగాఁ జదువుకొని భారతపరిశీలనమునకుఁ బోదము.

తనకు సంతానము లేమికి వగచుచు దశరథుడు మంత్రితోనాడు నీ మాట లెంతగా మనస్సును గరగించు చున్నవో చూడుడు:—

"ఇడి పొత్తుకల భార్య నడికట్టుతో వచ్చి
యందీయఁ బసిపాపనందుకొనఁగ
చిటికతోఁ బల్కరించినఁ దొట్టెలో బిడ్డ
బోసినవ్వుల చిట్టిపకాసు మఱుగ
రా బాబు నీవిట్లు రా యని నవ్వుచుఁ
జే సాచ మార్నవ్వు శ్రీల కుబుక
గృహముఁ జేరిన యంతనే కాళ్ళ కడ్డమ్ము
వచ్చి మోకాళ్ళలఁ బ్రాఁక నుబ్బ
తత సుకృతమేమి చేయు దంపతులు ధాత్రి
నోచుకొందురొ నేనింత నోచలేదు
అల్ల కౌసల్య నోచలే దా సుమిత్ర
నోచలేదు కైకేయియు నోచలేదు."

సత్యనారాయణగారు మహాపాండిత్య ప్రతిభల నుపయోగించి పండితులకుమాత్రమే తెలియునట్లును కవిత లల్లగలరు. పాండిత్యకర్కశములు కాని మృదుహృదయములుగూడ పులకించునట్లు తియ్యతియ్యగా సొంపైన తెలుగు పలుకులతోను కవిత లల్లగలరు. ఈ విషయమునకు వైపద్యమే తార్కాణము. కవితలో ధర్మాభిరతియు నీయన యగ్గలముగా జూపించును. ఆ ఘట్టములోనే దశరథుడు—

"ఓరగఁ బుణ్యలోకము లటుండఁ బ్రజార్థము కానియట్టి భా
ర్యారతి చూడఁ బాశవము కన్నను హీనము సంతులేని సం
సారము సేఁత ధర్మపరి సంగతి మాలిన రాజ్యపాలనం
బారయ ద్రవ్య కామ మలినాత్మలు సేయుదు రిట్టి పాపముల్.

సంతానములేని భార్యారతి నీచమను ప్రాచీనధర్మ మిందుద్ఘాటింపబడినది. సీతమీఁది మక్కువచేత ఉషోధి దేవతలు—

"దుమ్మడగించి ముంగిళులు తోఁగగఁ జేసి కలాపి జల్లి ము
త్తెమ్ముల సన్నముగ్గులను దీరిచి బాల లుషోధిదేవతల్
పమ్మిన యందగింపు హిమ పాతమువేళల రాఘవేంద్రు గే
హమ్ములఁ జేసిపోయెద రహో జనకాత్మజమీఁది మన్ననన్."

సామాన్య జానపదులకు సంబంధించిన విషయములు, వ్యావసాయక రహస్యములు ఈ కవి కెన్నియో తెలియును. పట్టినది బంగారు చేయగల ప్రజ్ఞ యీయన కున్నది.

"మాగాని పరశురామప్రీతి యైనట్లు
మొలకనారులె యెత్తు తలలు వేసె
మెట్టచాలుల విత్తుపెట్టకముల్నె చు
మ్మలు చుట్టి మలమల మాడిపోయె
ఊట లూరెడి సెలయేటి మేల్వారవలు
సెండిన బుగ్గలై యింకి పోయె
బావులలో నీరువట్టి పూడికఁదీయ
మున్ను పుట్టినజల మిన్నుపట్టె

పాడియావుల చన్నులు పట్ట నెత్తు
ధార లాడిన జనులు హా హా రవముల
రాజు మొగసాల నిలచి మెచ్చు లిడినంత
విభుఁడు నేద్పుచు వారిఁ జే విసరి పంపి ”

యజ్ఞసందర్భములోని భోజనముల పస యెట్లున్నదో చూడుడు—

“ఇప్పుడె గుండిగ దింపి యిగురఁ బెట్టితిఁ బొడి
పొళ్ళాడు నీ యన్నమును దినుండు
పూర్ణమ్మ లేకుండఁ బునుకులుగా వేసి
తిమి కరకరలాడు తినుడు వీని
కాలుచు నున్నది కాఁబోలు క్షీరాన్న
మిదె దొన్నెలను దెచ్చి యిత్తు నుండు
డిది గడ్డపెరుగు మీ రింకఁ గొంచెము వేసి
కొనవలెఁ జలువ సేయును గదండి
యనుచు బతిమాలి బతిమాలి యవనినాథ
సూదకులు కొల్లలుగఁ దెచ్చి చూఱ యీయ
నన్నము నసాదరంబున దిన్న కడుపు
లెన్న నెడదలు నుబ్బిపోయెదరు జనులు.”

ఈ విధములగు వర్ణనలు సత్యనారాయణగారి రామాయణములో పెక్కులు. మొత్తముమీద సత్యనారాయణగారి గద్యరచనముగాని, పద్యరచనముగాని ప్రౌఢతరమై యుండును. నవ్యాంధ్ర కవిలోకమున ఈ కవి దొక విశిష్ట స్థానము. వీరి రామాయణమున కాంధ్రసాహిత్యమున తగిన స్థానమున్నది.

“జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః”

## ౨

# మహాభారతము

రామాయణమున కాదికావ్యమని నామాంతర మున్నట్లే భారతమునకును పంచమవేదమని యొండొక పేరు గలదు. వేదములు వివిధ ధర్మములకును, జ్ఞాన విజ్ఞానములకును నిలయ మైనట్టివి. అయినను వైదికభాష సర్వజన సాధారణమైనది కాదు. వివిధ వ్యాకరణ నియమ బద్ధమై, ఉదాత్తానుదాత్తాది స్వరశోభితమై యొప్పును. వేదమంత్రముల యర్థము నెఱుంగవలయునన్న వేదాంగముల నెఱుంగవలయును. ఈ వేదాంగములను బఠించి వాని సాహాయ్యమున వేదార్థము నెఱుంగుట సర్వజన సాధారణము కాదు. అందుకై యా వేదార్థమును జనసామాన్యమునకు దెలియు తేలికభాషలో ననువదించు టవసర మైనది. మఱియు వేదములను స్త్రీ శూద్ర ద్విజబంధువులు చదువరాదని పూర్వము నియమ ముండెడిది. ఆ కారణముచేతను వేదవిషయములు సర్వజన సులభములు చేయ నెంచి వ్యాసమహర్షి మహాభారతమును లౌకికసంస్కృతభాషలో రచించినాడట. మహాభారతములోని కథ కౌరవ పాండవుల చరిత్రము. ఆ కథావృత్తము నాధారముగాఁ జేసికొని ఇంకను వివిధ కథో

పాఖ్యానములను దోడుచేసికొని చతుర్వేదముల యందలి ధర్మములను విస్తరించుట మహాభారతకర్త యుద్దేశ్యము. కావుననే త్రయీధర్మములను కథోపాఖ్యానముల మూలమున ప్రవచనముచేయు మహాభారతమునకు పంచమవేదమని ప్రఖ్యాతి వచ్చినది.

కౌరవ పాండవ యుద్ధానంతరము వ్యాసముని మూఁడు సంవత్సరము లేకాంతవాసముచేసి ఏకాగ్రమగు కవితాదీక్షతో మహాభారతమును రచించినాడు. గొప్పదియు, బరువైనదియు నగుటవలన దీనికి మహాభారతనామము సార్థక మయ్యెనని చెప్పుదురు. మఱియును దేవతలు మహాభారత గౌరవము నారయ దలంచి వేదముల నొకప్రక్కను భారతము నొక ప్రక్కను తులలోబెట్టి తూచిరట. అప్పుడు భారతమువైపు నకే ముల్లు మొగ్గెను. ఆ కారణముచేతను మహాభారతమని పేరు వచ్చినదని భారతములోనే వర్ణింపబడియున్నది. భరత వంశపురాజుల చరిత్రమును జెప్పు గ్రంథము గావునను భారతమని చెప్ప నొప్పును.

ఈ మహాభారత మితిహాస గ్రంథము. ఇతిహాసమనగా పూర్వరాజుల చరిత్రము నాధారముగా చేసికొని ధర్మార్థ కామ మోక్షముల నుపదేశించు గ్రంథరాజము. ఇందు కౌరవ పాండవుల కథ నాధారముగాఁ జేసికొని చతుర్విధ పురుషార్థములు, వివిధములగు లౌకిక వైదిక ధర్మములును

బోధింప బడుచున్నవి. భారతయుద్ధము పదునెనిమిది దినములు ప్రవర్తిల్లినది. తదనుసారముగనే భారతముగూడ అష్టాదశ పర్వములతో విలసిల్లునట్లు కూర్పబడెను. ఇందు శాంతిపర్వమును, అనుశాసనిక పర్వము ననునవి ప్రధానముగా మోక్షధర్మముల నుపదేశించుటకే యుద్దేశింపబడినవి.

సంస్కృత మహాభారతము అష్టాదశ ప్రధానపర్వములతోగూడ శతపర్వ సంశోభితమై శతసహస్రశ్లోక పరిమితమై యొప్పుచున్నది. భారతదేశములో పంచమవేదమని ప్రఖ్యాతి చెందిన మహాభారతమునకు సాటిలేని గౌరవము కలదు. సర్వ వేదములయు, సర్వశాస్త్రములయు, సర్వపురాణములయు సార మిందు గలదని భారతాదియందే కీర్తింప బడెను—

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు,
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహా కావ్య మనియు,
లాక్షణికులు మహాలక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు,
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ,

వివిధ వేద తత్వ వేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు ”

—ఆదిపర్వము

సంస్కృతభాషలోని కావ్యగ్రంథములలో రామాయణమునకు తరువాత విరచితమై వన్నెకెక్కిన గ్రంథరాజ మియ్యదియే యగుటయు, నశేష ధర్మము లిందుఁ బ్రవచింపఁబడి యుండుటయు నీగ్రంథమున కింతటి గౌరవము చేకూరుటకు హేతువులై యుండవచ్చును. పురాణాదులు నైత మున్నను ప్రధానముగా నేకకథాబద్ధమగు భారతము వానికన్న ప్రత్యేకతగలదై యలరారుచున్నది. ఇట్టి యుత్కృష్ట గ్రంథమును రచించిన పారాశర్యుడును విష్ణుసన్నిభుడని కీర్తింపఁ బడినాడు. మఱియు కృష్ణద్వైపాయ నోద్యానములోఁ బుట్టిన యీ భారతపారిజాతము ధాత్రీసుర ప్రార్థ్యమై వారియిష్టములను దీర్చుచున్నదట:—

“అమితాఖ్యానక శాఖలం బొలిచి, వేదార్థామల చ్ఛాయమై
సుమహా వర్గచతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యానజా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై.

భారతీయసాహితీదృష్టి పురుషార్థ పరమైనది. పురుషార్థ దూరమైన యే పనికిగాని యీ కర్మభూమిలో స్థానము లేదు. కథలు మొదలుకొని వేదవేదాంతముల వఱకును గల సర్వ సారస్వతమును పురుషార్థములను ప్రబోధించుచు పాఠకునకు సదుపదేశమును జేసిననేకాని చరితార్థముకాదు. కావుననే

"కమనీయ ధర్మార్థ కామమోక్షములకు
నత్యంత సాధనం బైన దాని
వేడ్కతోఁ దవిలి దగ విను చున్న వారల
కభిమత శుభకరం బైన దాని..."

అని పురుషార్థ ప్రతిపాదన మిద్దాని ముఖ్యోద్దేశ్యముగా చెప్పఁబడినది. అనేకదానములు, యజ్ఞములు, వ్రతములు మున్నగు పుణ్యకార్యములు సలిపిన నే ఫలము లభించునో, అట్టి సత్ఫలము కేవలము భారతార్థ శ్రవణ మనన నిదిధ్యాస నములచేతనే గలుగవలయు ననుచున్నాడు కవి:—

"ఇమ్మహాభారతం బిమ్ములఁ బాయక
విహితావధానులై వినుచునుండు
వారికి విపుల ధర్మారంభ సంసిద్ధి
యగుఁ బరమార్థంబ యాశ్రమమున,

## మూడు కావ్యాలు

వేదముల్ నాలుగు నాదిపురాణముల్
పదునెనిమిదియుఁ దత్ప్రమిత ధర్మ
శాస్త్రంబులును మోక్ష శాస్త్ర తత్త్వంబులు
నెఱిఁగినఫల మగు నెల్ల ప్రొద్దు
దానములను బహువిధక్రతు హుత జప
బ్రహ్మచర్యములను బడయఁ బడిన
పుణ్యఫలము వడయఁ బోలు నశేష పా
ప క్షయంబు నగు శుభంబు పెరుగు.''

—ఆదిపర్వము.

మహా జ్ఞాన నిధానమగు భారతము మహిమ నింతగా కవి వర్ణించుటలో నతిశయోక్తి లేదు. భారతపఠనము, తదర్థావ ధారణము, తదాచరణము నను కార్యములు యజ్ఞ సదృశములే కాదు, ఉత్తమ యజ్ఞములే. సర్వయజ్ఞములలో జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమని భారతాంతర్భూతమగు భగవద్గీతయే వాకొనుచున్నది. భారతపఠన మిట్టి మహా జ్ఞానయజ్ఞము కావున నద్దానిఫల మింతింతయని వర్ణింపఁజాలము. మఱియు—

''ఐహికాముష్మిక శ్రేయఃప్రాప్తి నిమిత్తము
నానావేద వేదాంత విద్యాయుక్తము నైన'' దట యిది.

కవిబ్రహ్మ తిక్కనయు భారతపు గొప్పదనమును గూర్చి యిట్లనుచున్నాఁడు—

"విద్వత్సం స్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకర సంభావ్యానుభావుండు కృ
ష్ణ ద్వైపాయనుఁ డర్థి లోకహిత సిద్ధం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయముఁ౯."

మనవారి దృష్టిలో వేదము పరమేశ్వరునినుండి వచ్చి నట్టిది. అది యొక కవిగాని పలువురు కవులుగాని వ్రాసి నట్టిది కాదు. అందుచే నది యలేఖ్యము. ఆ వేదవిషయ ములనే యనువదించుచు వ్రాసిన యీ భారతము లేఖ్యమగు నామ్నాయ మట.

ఇట్టి దీని మహిమ యస దెట్లగును? ఏ కావ్యమైనను అందు వర్ణింపబడెడు నాయకావతంసుల గుణమాహాత్మ్య ముచే మహనీయ మగుచుండును. మహాభారత నాయకులు లోకోత్తరులు. అందును గృష్ణార్జును లసదృశులు. కావుననే "నారాయణ పాండవేయ గుణ మాహాత్మ్యామల జ్యోత్స్న" తో నొప్పు మహాభారత రాకాసుధాకరు డెల్లరకు నుప సేవ్యుడై యమృతరసము నందించినాడు. ఈ మహాభారత కావ్యనాయకులనుగూర్చి నన్నయకవి—

"వినుత పరాక్రముల్, ధృత వివేకులు, సత్యసమన్వితుల్ యశో
ధనులు, కృతజ్ఞు, లుత్తములు, ధర్మపరుల్, శరణాగతానుకం
పను లనఁగాఁ బ్రసిద్ధులగు భారతవీరుల సద్గుణానుకీ
ర్తనముల నొప్పుదాని విదితం బగుదాని సభాంతరంబులఁ౯."

అని వారి మహానాయకత్వమును గొండాడినాడు. ఇందలి పాండవులు లోకోత్తర గుణోత్తరులు. సత్య ధర్మముల కోసము జీవిత సౌఖ్యము నంతయు బలియిచ్చిన ధర్మజుని ధర్మనిష్ఠ సాటిలేనిది. ద్యూత వ్యసనముగల యాతడు తన చేసిన తప్పునకు దగు ఫలము ననుభవింపఁ గుటుంబము నంతయుఁ బాల్పడఁ జేసినాడు. అన్న యాజ్ఞను జవదాటని సోదరులు ధర్మజుని ధర్మమార్గాను సరణమున కధీనులై తమ యాదర్శ సౌభ్రాతృత్వమును జాటిరి. మగవారైన భీమాదులమాట కేమిగాని, మహాసాధ్వియు, అసూర్యంపశ్యయు నగు ద్రౌపది సైతము అష్టకష్టములకు లోనై పాతివ్రత్య మహిమను బ్రకటించి స్త్రీలోకమునకు మార్గదర్శిని యైనది.

మహాభారతములో ప్రముఖస్థానము నొందినవాడు ధర్మరాజు. ఈతఁడు యుధిష్ఠిరుఁడయ్యును అజాతశత్రుఁడై ప్రతిష్ఠ నందిన ఘనుఁడు. తన కెగ్గు చేసినవారికైనను గీడు గోయక వారి మేలునే వలచునట్టి పరోపకార పరాయణుఁ డీ శాంత మూర్తి. కౌరవులు చిన్ననాటినుండియు తమ్మిడుములపాలు చేయుచున్నను, వారికి రోషింపక ప్రతీకారమును జేయఁగోరకుండుటలో ధర్మజుని ధర్మనిష్ఠయు శాంతిప్రీతియు వ్యక్తములగుచున్నవి. పాండవపత్ని యగు ద్రౌపది కౌరవరాజు నిండు సభలో నట్టి పాటున కగ్గమైనను ధర్మపాశబద్ధుఁడగు ధర్మజుడు చలింప లేదు. భీమార్జునులు — అందును భీముడే

చలితహృదయు డయ్యెను. పత్నీపరాభవమును సహింపఁ జాలని వృకోదరుని యమర్షమే దుశ్శాసనుని తొమ్మునగల్చి నెత్తురు ద్రావుటకును దుర్యోధనుని యూరుభంగ మొనర్చి వానిఁ దుదముట్టించుటకును బ్రతిన వట్టించెను. భీమసేనుని యీ ప్రతిజ్ఞలు రిత్త కాకుండుటకును మహాభారతయుద్ధ మనివార్యమైనది. భీమునివంటి క్రోధనుడే పాండవపక్షమున లేకున్న ధర్మజుడు బిచ్చమెత్తుకొని బ్రతుకుటకైన నొప్పుకొని ప్రజాక్షయకరమగు యుద్ధమును నివారించెడు వాడనవచ్చును. కనుకనే "అయిదూళ్ళను మాకిచ్చినను జాలు" ననియు, "పగ యడఁగించు టెంతయు శుభం" బనియు కృష్ణునితో వాయెత్తి చెప్పినాఁడు. బిచ్చమేల యెత్తుకొన రాదన్న? అది తన కభిమతమేయైనను పోష్యవర్గ మెట్లొప్పుకొనును? కాబట్టియే పిండితార్థముగా నిట్లన్నాఁడు.

"ఇచ్చటి బంధులు నీవును
నచ్చెరువడి వినుచునుండ నయిదూళ్లను మా
కిచ్చినను జాలునంటిని
బొచ్చెముగా దింతవట్టు పూర్ణమ్ము సుమీ.

ఆ దుర్యోధనుఁ డంతమాత్రమును జేయం జాలఁడో కాని పెం
పేదం గ్రూరత కోర్వరాదు సిరి నాకేలందునే గ్రాస వా
సో దైన్యంబులు వచ్చు నా యరయు నీ చుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గు కాఁపులు నేముం బొంది శ్రీనొందినన్.

ధర్మజుని ధర్మనిష్ఠ భారతములో ధర్మదేవతచేత మువ్మారు పరీక్షితమైనది. ఎన్నిమారులు లెట్లు పరీక్షింపఁబడి నను ఆతడు ధర్మమార్గమునుండి యొక్క యడుగైనను జలింపఁడయ్యెను. పాండవులు ద్వైతవనములో నివసించునపు డొక సారి దప్పి దీర్చుకొన జలములు వెదుక నవసరమైనది. భీమాదులు నల్వురునేగి కొలనిలోని నీరుద్రావి మూర్ఛిల్లిరి. కడకు ధర్మజుడేవచ్చి నీరు దీసికొనఁ బోయెను. అప్పు డశరీర భూతము తొంటి యట్లు ధర్మజుని నివారించి కొన్ని ప్రశ్న లడిగెను. ఆ ప్రశ్నములకు ధర్మజుఁడు సదుత్తరంబు లిచ్చిన పిమ్మట నాభూతము (ధర్మదేవత) మెచ్చుకొని నీ తమ్ములలో నొక్కరుని బ్రతికించెదను. ఎవ్వని సంజీవితుని జేయుమందువో తెల్పుమన, ధర్మజుడు పెద్ద యాలోచించి నకులుని బ్రతికింప వేడికొనెను. అందుకా ధర్మదేవత ధర్మజుని పరీక్షింప నెంచి —మహా పరాక్రమాన్వితులగు భీమార్జునులలో నొక్క రుని గోరక నకులుని గోరుటలోని విశేష మేమనెను. అందు లకు పాండవాగ్రజుండు మాతల్లు లిద్దఱిలో కుంతీదేవి సంతాన మగు నేను బ్రతికి యుంటిని. మాద్రిసంతానములోను నొక్కరు డుండుట ధర్మసమ్మతము. కావున నాయమ్మ పెద్ద బిడ్డఁడగు నకులుం గోరితి నని ప్రతివచన మిచ్చెను. అతని యీ ధర్మనిష్ఠకు ధర్మదేవత యెంతయు నలరి యభీష్టవరంబు లచే ధర్మజుని సమ్మానించెను. రానున్న మహా యుద్ధములో

దద్దయు నుపయోగించు భీమార్జునుల బ్రతుకు నాశింపక ధర్మపాశబద్ధుఁడై నకులుని సంజీవితుని జేయుమనుటలో ధర్మజుని ధర్మైకపరత, నిస్స్వార్థబుద్ధి వ్యక్త మగుచున్నవి.

అసలు ధర్మరాజు ధర్మసంరక్షణార్థ ముదయించిన కారణజన్ముఁడు. భార్యా పుత్త్ర మిత్ర బాంధవు లెట్లు పోయినను ధర్మము సురక్షితమైన నాతనికిఁ జాలును. ఈ యంశము మహాప్రస్థానములోఁ దేఁటతెల్ల మగుచున్నది. ధర్మజుడు స్వర్గమునకుఁబోవ మహాప్రస్థానము చేయునప్పుడు తాను ముందును, తరువాత భీమాది సోదరులును, బిమ్మటఁ బాంచాలియు, అటుతరువాత నొక కుక్కయు సాగిపోవు చుండిరి. కొంతదూర మేగునప్పటికి పాండవపత్నియగు ద్రౌపది మార్గశ్రమకుఁ దట్టుకొనజాలక పడిపోయెను. ఆ సంగతిని భీముడు పాండవాగ్రజున కెఱింగించెను. కాని ధర్మరాజు మాత్రము చలింపక ద్రౌపది తనకర్మముచే నట్టి పాటునకు గుఱి యయ్యెనని గంభీరముగా సమాధానము చెప్పి తనదారిని దాను బోఁజొచ్చెను. తరువాత సహదేవుడు, నకులుడు, అర్జునుడు, వృకోదరుడు నట్లే పడిరి. ధర్మరాజుమాత్రము శోక మోహములకు లోఁబడక వారు పడుటకుఁ గారణ మెఱింగినవాఁడై పయనమును సాగించుచునే యుండెను. వీరందఱును ప్రస్థానశ్రమ కోర్వఁజాలక పడి పోయినను వీరిని వెన్నంటి వచ్చు శ్వానము మాత్రము శ్రమ

చెందక ధర్మరాజు ననుగమించెను. తుట్టతుద కింద్రుడు ప్రత్యక్షమై దివ్యవిమానముమీద ధర్మజుని స్వర్గమునకు గొంపోవ సిద్ధపడెను. ధర్మరాజు తనతమ్ములను భార్యయును మార్గాయాసమున కోర్వక పడిపోవ నీశునకము తన్ను వెన్నంటె ననియు నట్టి కుక్కతో గూడ తాను స్వర్గమునకు రావలయు ననియుఁ బట్టుపట్టెను. ఇంద్రుడు కుక్కకు స్వర్గ గమనయోగ్యత లేదని నివారించెను. అయినను ధర్మరాజు వినలేదు. నా వారందఱు మరణించినను ఈశునకము మాత్రము హతము కాక నన్ను నమ్మి వచ్చినది, కావున దానికి లేని స్వర్గమును నేనొల్లనని యింద్రునితో ననియెను. అంతట సారమేయరూపమున నున్న ధర్మదేవత నిజస్వరూపముతోఁ బ్రత్యక్షమై ధర్మజుని సశరీరముగా స్వర్గమున కనిచెను.

ఇట్టి ఘట్టములంబట్టి చూచినచో నాతనికి ధర్మమునందుఁ గల యనురాగము తెలియఁగలదు. ధర్మమున విజయసిద్ధి గాంచవలయునన్న నరుఁ డెంతటి త్యాగములను చేయవలసి యుండునదియు నీ వృత్తాంతముచే సూచిత మగుచున్నది.

జ్ఞాతివైరముగూడ ధర్మజుని హృదయమున లేదు. దుర్యోధనాదులు చెడ్డవారైనను వారి పాపము వారినే హరించు ననుట ఈతని నిశ్చయము, కావుననే సపరివారుడగు సుయోధనుని గంధర్వరాజగు చిత్రసేనుఁడు బంధించి తీసికొనిపోవు నప్పుడు దుర్యోధనభృత్యులచే నా వార్త నెఱింగిన యాతడు

వారిని గాపాడుటకై తమ్ములచు బ్రేరేపించినాడు. భీము డందు కియ్యకొనక "కాఁగల కార్యము గంధర్వులే తీర్పగా వారిని విడిపించుటయు, మఱల వారితో సమరముచేసి రాజ్యమును సంపాదించుటయు నను పనులు మన కేల" యని యెదురు తిరిగెను. ధర్మజుఁ డందు కొప్పుకొనలేదు. "దుర్యోధనుని దుర్బుద్ధిచే మనలో మనకుఁ బొరపొచ్చెములు గలిగినఁ గలుగుఁ గాక. మన దేక కుటుంబము. ఇతరులు మనలఁ బరాభవింప వచ్చినప్పుడు మన మైదుగురు సోదరులము కాము. నూటైదుగురమని తలంపుము. మఱియు నిది శరణాగతరక్ష సుమీ! మనము రక్షింతుమనియే సుయోధనుఁడు మనవద్దకుఁ దన యాశ్రితులను బంపినాఁడు.

శరణంబని వచ్చిన భీ
కర శత్రుని నైనఁ బ్రీతిఁ గావఁగవలయుం
గరుణాపరుల తెఱఁగిది;
యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్."

అని భీమునకు నచ్చఁజెప్పి "నేను యజ్ఞదీక్షితుండనై యుంటిని. లేకున్న నేన పోయి దుర్యోధనాదుల విడిపింతు" నని మహోదారముగాఁ బల్కి వారిం గాపాడఁ జేసెను. ఇట్టి మహనీయగుణములు, సదాచరణములును ధర్మజునిలో గాంచిన ట్లింకొక భూపాలునిలోఁ గాంచము. ఇట్టి యుదాత్త

చరిత్రుఁడు మహాభారతములో నాయకుడగుట నయ్యితిహాస మనన్యమై యొప్పినది.

అయినను ధర్మరాజు ద్రోణ మరణ సందర్భమున "అశ్వత్థామా హతః, కుంజరః" అని మృష పలికినాడని కొందఱు విమర్శింతురు. అందు కాతడు నరకదర్శన రూప మయిన ప్రతిఫలము నందకపోలేదు. ఇట్టి యలఁతి దోసంగులు మానవుడుగాఁ బుట్టినవాని కసహజములు కావు. వాని నన్నింటి నతిక్రమించి యతిలోకమగు చరిత్రమును నిర్మించు కొనుటలోనే మహాపురుషుల లక్షణములు ప్రకటము లగు చుండును.

మహాభారతములో ధర్మజునివలెఁ బ్రశంసింపఁదగిన వాఁడు మహాదాతయగు కర్ణుడు. దురదృష్టవశమున కర్ణుడు ప్రతిపక్షమునఁ జేరినవాఁడాయెనుగాని, లేకున్న నాతని గుణ శీలము లనన్యసామాన్యములుగా గొండాడఁ బడెడివి. అసలు మహాభారతకథ కంతెయు నీతడే మూలపురుషుఁ డనవచ్చును. ఎవ్వనియండఁ జూచుకొని కౌరవేశ్వరుడు పాండవులతోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వెనో, యాతఁడు సామాన్యు డెట్లగును? కావుననే "కర్ణుడులేని భారతమా" యను నా నుడి కలిగినది.

కర్ణునిలో శౌర్యసాహస పౌరుషాదుల నటుంచినచోఁ జెప్పదగ్గ గుణము లోకోత్తరమగు నౌదార్యము. సహజము

లైన కవచకుండలములను ఆత్మనాశనము వాటిల్లునని తెలి సియుఁ ద్యాగము సేయుఁజాలు నుదారుఁడెవఁడు? కర్ణుని దాతృత్వ మహిమ నెఱింగియే సూర్యుడు కవచకుండలములను మాత్ర మింద్రున కీయవలదని ప్రబోధించెను. అయిన నాతడు విన్నాఁడా? కర్ణుని యీ త్యాగము "తన్నుమాలిన ధర్మమై" యాతని కీర్తిని చిరస్థాయి యొనర్చినది.

కర్ణుని శీలసంపత్తికిని, త్యాగశక్తికిని దార్కాణమైన ఘట్ట మింకొక్కటియుఁ గలదు. శ్రీకృష్ణుఁడు రాయబారము నకై వచ్చినప్పు డా ప్రయత్నములు విఫలములు కాఁగా కర్ణుని రథముపై నెక్కించుకొని కొంతదూరము పయనించుచు నాతని కిట్లుద్బోధించెను.

"కర్ణా! నీవు కుంతికొడుకవు. సూర్యవరముచేఁ గుంతి కన్యగానున్నప్పుడే ప్రభవించితివి. ఇట్టి నిన్ను ధృతరాష్ట్రుని సూతు డతిరథుడు పెంచి పెద్దఁజేసెను. నీవు రాధకు పెంపుడు బిడ్డవే కాని యౌరసుఁడవు కావు.

నీ విపుడు పాండవ పక్షమునకు వచ్చునెడల ధర్మజా దులు నాచే నీ వృత్తాంతము నెఱింగి నిన్ను మహాసామ్రాజ్య మున కభిషిక్తుం జేసి కొల్తురు. అంతియేకాదు. ద్రుపద నందనయు నీ కగ్రమహిషి కాగలదు. బంధువుల కెల్లరకును ప్రియాతిప్రియమగు నీ కార్యమున కంగీకరింపుము."

ఈ మాటలు నిస్స్వార్థబుద్ధి యగు కర్ణునకు రుచింప లేదు. రాజ్యలోభముచేత దుర్యోధనుని మోసగించుట కాతఁ డియ్యకొనలేదు. తన్నుఁ బెంచి పెద్దవానిం జేసిన రాధా-అతిరథులను వీడుట కాతఁ డంగీకరింప లేదు. ఎవ్వాని బాహుసారముపై నమ్మకముంచి దుర్యోధనుఁ డర్జునుం గెలువ నిశ్చయించుకొనెనో, అట్టి కౌరవరాజును గర్ణుడు వీడు టెట్లు? కావుననే—

సూతసుతుండు వీఁడనక
సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును
బెంపును నాఁటికి నాటి కగ్గలం
పై తనరార నన్నుఁ దన
యంతటి మానిసిఁ జేసియుండ నే
నే తగవూఁది యాకురు కు
లేశ్వరుఁ బాయుదు మట్టవచ్చినన్.

అనుచున్నాఁడు. కర్ణుని కృతజ్ఞతామహిమ యెంతటిదో చూచితిరా? కనుకనే కృష్ణుఁడు చెప్పిన హితము తన మతి సారలే దనుచున్నాఁ డాతఁడు.

కర్ణుడు తన లావును ఎదిరి లావును నెఱిగినవాడు, ధర్మాధర్మములుగూడ నాతనికి మూలమట్టముగా నెఱుకయే. సహజ కవచకుండలములను చేఁజేత పోగొట్టుకొన్న తాను,

అర్జునుని గెలువజాలకుండుట ఆతఁడు భావింపక పోలేదు. అట్లే మహాధర్మశాలియగు యుధిష్ఠిరుఁడు—విజయము నందఁ గలఁడనియు కర్ణుఁ డెఱుంగును. ఈ యభిప్రాయము నిట్లు స్పష్టముగా కృష్ణున కాతఁడు సూచించినాఁడు గూడను.

ధర్మతనయుండు దాను నా తమ్ముఁడగుట
యెఱిఁగె నేనియు సామ్రాజ్య మేల పూను ?
నట్టి ధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ
వలవదే శాశ్వతంబుగ వసుధ యెల్ల ?

అనుజాలం బుత్విజాలుగ నీ
వని యిటు సేయుమని నీ వుపద్రష్టవుగా
విను కురుకుమార పశు విశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతి సేయుఁగా.

"దానం బుణ్యభూమియగు కురుక్షేత్రంబున మము బోంట్లెల్లను సద్గతిఁ బడయుదురుగాక." అని గెలుపు యుధిష్ఠిరునిదే యని కర్ణుడు జోస్యము చెప్పినాడు. అంతియే కాదు. ఇమ్మహా రణమునకుఁ గారకులైన వారిలో దాను నొక్కరుఁడని కర్ణు డొప్పుకొనుచున్నాడు గూడను.

దీనికి మూలము శకునియు
నేనును, దుశ్శాసనుండు, నింతియ; కుంతీ
సూనుల వారలు గలసిన
రానేరగవచ్చు నాకు రాజీవాక్షా.

ఇంత ధైర్యముగా నిజము పల్కుట సామాన్యున కలవి గాని పని. అందును స్వవిషయము నిట్లు చెప్పి యంగరా జాదర్శ పురుషుడై మెఱసినాడు. ధర్మజుని ధర్మనిష్ఠపైఁ దన కంత నమ్మిక యున్నను, దుర్యోధనుని దౌరాత్మ్యము నాతఁ డెఱింగియున్నను, "అంగీకృతం సుకృతినః పరిపాలయన్తి" అను న్యాయమునకుఁ గట్టుపడి మహారాజ్య విభవమునుగూడఁ ద్రోసిపుచ్చినాడు. ఎంతటి త్యాగ మీాతనిది! తరువాత కుంతి వచ్చి యీాతని జన్మప్రకారమును వివరించి చెప్పి పాండవులఁ గలయ రమ్మన్నను ఆతఁడు సరకు సేయలేదు. కౌరవుల యుప్పుఁపులుసు దిని వారల కవసరమగు తఱిని జారు కొనుట రాచపాడి గాదని "...పాండవుల్ సేపడిరేనిఁ జంప నరసేయక చెప్పెద సవ్యసాచిపైఁ గోపముపెద్ద వాఁడు సమ కూఱినఁ బిట్టఱఁ జంపుదుం జుమీా" అని తన యభిమతము నెఱింగించినాడు.

భారతములోని కర్ణపాత్రము ప్రతిపక్షమునఁ గాక ప్రధానపక్షముననే యున్నచో బంగారు పరిమళించినట్లుండె డిది. ఇప్పుడైనను గర్ణునిలోని మహనీయగుణములు జనుల నాకర్షింపక పోవలేదు. అయినను కర్ణునికిఁ జరిగిన యన్యాయ ములు పెక్కులు. అందు మొదటిది కులవిషయికము. తక్కినవి గురుశాపాదులు. ఎన్ని కారణములచేతనో కర్ణుడు మడిసినాఁడు కాని, లేకున్న నాతనింబట్ట పగ్గము లుండెడివి కావు.

ఇంకను చెప్పఁదగిన మహాపురుషులలో భీష్ముఁడొకఁడు. కురుకుల వృద్ధుఁడగు నీతఁ డెఱుంగని ధర్మములు లేవు. ఎట్టి ధర్మసూక్ష్మము నేని యాతఁడు నిర్ణయింపగలడు. శాంతి - అనుశాసనిక పర్వములందలి మోక్షమార్గములు, ధర్మపథములు నీతడు చూపునవే. వయోవృద్ధత్వము, ధర్మజ్ఞాన వృద్ధత్వము తోడుగా నీత డద్భుత త్యాగము సల్పిన సచ్చరిత్రుడు. తండ్రికి సత్యవతిని గూర్చు నిమిత్తము ఆజన్మ బ్రహ్మచర్యవ్రతము నెఱప ప్రతిన సలిపిన యాతని స్వార్థ త్యాగ మెంత ఘన మైనది? పితృవాక్య పరిపాలనమునకు రామచంద్రుడు రాజ్యత్యాగ మొనర్చి వనవాసము నంగీకరింపఁగా, దేవవ్రతుఁడు పితృకృతమై జీవితమంతయు స్త్రీ సౌఖ్యమును ద్యాగముచేసి వందలయేండ్లు కఠోరబ్రహ్మచర్యమును నెఱపి ధన్యుఁడయినాఁడు. ఏ దేశపు చరిత్రలోను ఇట్టి మహామహిముని మనము పొడగాంచలేము. భీష్మునివంటి లోకోత్తర చరిత్రుని గన్న భారతమాత ధన్యురాలు. ఆతని నాదర్శమానవునిగా నారాధించు మనము ధన్యులము.

భారతములోఁ బేర్కొనఁదగిన మఱొక పుణ్యాత్ముఁడు విజయుఁడు. ఈతఁ డన్న కెంతయుం గూర్చు తమ్ముఁడు. శుద్ధసత్త్వము కాక, రజఃప్రధానమైన సత్త్వగుణ మీతనిది. కావున ఉత్తమక్షత్రియుఁ డని వీనిం బేర్కొనవచ్చును. వీరోచితములగు నుదాత్తగుణములకే గాక దయా దాక్షిణ్యాదుల

కును ఈతడు నెలవు. పాండవపక్షమున వీరవిక్రమమునకుఁ జెప్పఁదగినవారిలో నీతనిది తొలిపేరు. కృష్ణదేవుని రథసారథిగాఁ జేసికోఁజాలిన యీ జెట్టి భౌతిక క్షేత్రముననే కాక, ఆధ్యాత్మిక క్షేత్రమందును గెలుపొంది భగవద్గీతార్థమును లోకమున కందింపఁ గారణభూతుఁ డైనాఁడు. యుద్ధారంభమున దేహాత్మ భ్రాంతిఁ దగిలి తత్త్వార్థము నెఱుంగక శోక మోహములకు గుఱియైన వీనిని గర్తవ్యోన్ముఖుని జేయుటకే భగవానునకు గీతార్థము నుపదేశించు టవసరమైనది. తొలిపుట్టువున బదరికాశ్రమమున నరనారాయణులై మెలగిన ఋషులే కృష్ణార్జునులుగా నవతరించినా రందురు. ఎట్లయినను వీరు కారణజన్ములే కాని సామాన్యులుకారు. వేదాంతులు వీరిని జీవేశ్వరులుగను,—ఆత్మ పరమాత్మలుగను వర్ణింతురు.

దుర్యోధనుఁడుగూడ సార్వభౌమోచిత లక్షణములు కలవాఁడే కాని యగుణుఁడు కాడు. ఆతని కార్యశూరత, దర్పము, పరోత్కర్షాసహిష్ణుత మున్నగు గుణములు అతి వేలములు. ప్రజాపరిపాల నాదులలో నాతని కే వంకయు లేదు. పాండవుల యున్నతిని మాత్ర మాతఁడు సహింపలేక పోయినాఁడు. వారి పతనమునకై జీవితము నంతటిని ధారపోసి కడకుఁ బరాజయము నంది మాత్సర్యము ఆత్మనాశనము నొడఁ గూర్చునను నీతిపాఠమును లోకమునకు బోధించిన ఘనుఁ డాతఁడు

స్త్రీ జనమును గాంచినచో కుంతి, ఆమె కోడలగు ద్రౌపదియు నెన్నఁదగినవారు. ద్రౌపది వరమునఁ బుట్టినది. భరతవంశము మెట్టినది. పాండురాజంతవానికిఁ గోడలైనది. జనవంద్యులగు భర్తలను బొందినది. నీతి విక్రమ స్థిరులగు పుత్త్రిలను బడసినది. కోడఁబుట్టినవారి ప్రాపు గాంచినది. ఇన్ని విషయముల నామె ప్రసిద్ధ. వీనికన్న మిన్న యగునది కృష్ణుఁ డామెను సుభద్రకంటె నెక్కుడు గారవించుట. ఇది సామాన్యమా మఱి?

వాల్మీకి చిత్రించిన స్త్రీ పాత్రలలో సత్త్వగుణ ప్రధాన యగు సీత అగ్రేసర, వ్యాసుని స్త్రీ పాత్రలలో రజోగుణ ప్రధానయగు ద్రౌపది గొప్పది. ఈమె యుత్తమ క్షత్రియాంగన. మహావిక్రమ సంపన్నులగు భర్తలుండియు నీమె కాపదలు తప్పినవి కావు. ద్రౌపదిపడ్డ బన్నములు ఏ యువతియు బడియుండ దేమో. అన్ని కష్టములకు లోఁగినను ఈమె ఉత్తమ గృహిణీధర్మము నేమఱ లేదు. "షట్కర్మయుక్తా కులధర్మపత్నీ" అనురీతి నాఱు ధర్మములను సమానముగా నాచరించి యాదర్శభారతీయ నారియై పన్నె కెక్కిన దీ సుదతీ లలామము. కార్యాలోచనలో నసమానయగు నీమె యవసర మైన, ధర్మజునంత వానినిగూడ మందలించుటకు వెఱువదు. భీమునంత వానిచేతను జెప్పినట్లు చేయించుకొను నేర్పీమెకుఁ గలదు. అనేకవిషయములందు సమాన సంస్కారములుండుట

చేత నర్జునునిపై నీమెకు పక్షపాతము. భర్తలను మందలించి నను వారికి కార్యోపదేశము చేసినను పాతివ్రత్యమునకు భంగమురాని వడువున బ్రవర్తింపఁజాలును.

ద్రౌపది మహా ధీరస్వభావ. ఆమెకుఁ గల్గిన కష్టము లను తరించుట కామెకే సాధ్య మయినది కాని యొండొకతె యైనఁ దట్టుకొనఁ జాలదు. దుర్యోధనుని సభలో నామె పొందిన యవమానము, సైంధవు డామెను పఱచిన పాటు, కీచకుఁడు చేసిన కీడు సామాన్యములు కావు. ఇట్టి కష్టములను ధైర్యస్థైర్యములతో నెదుర్కొని గెలుపొందిన వీరవనిత ద్రౌపది. ఆత్మాభిమానముగల స్త్రీజాతి కీమె నయమార్గము లనుసరణీయములు.

గృహనిర్వహణములో ద్రౌపది యాడువారి కొజ్జ బంతి. రాజపుత్రియయ్యును సోమరియై కర్తవ్యముల నామె మఱువ లేదు. ఇట్టి యంశములు ద్రౌపది సత్యభామకు బోధించిన పాతివ్రత్య విశేషములందు సువ్యక్తము లగు చున్నవి. ద్రౌపదీ దినచర్యప్రకార మందుఁ గాననగు.

శత్రువులకుఁ బ్రతీకారము చేయగోరు నీమెకు సంధి యెంత మాత్రము నిష్టముకాదు. రాయబారమున కేగు కృష్ణు నుద్దేశించి యీమె పల్కిన వాక్యము లెంత యుద్దీపక ములో చూడుఁడు—కృష్ణుఁ డొకవేళ సంధి గుదుర్చునేమో

యను భీతి నామె బంధురమైన క్రొమ్ముడిని విప్పి యా వెండ్రుకలను వలకేలఁ బూని మనస్సులో పొంగులువాఱుచున్న రోషవిషాదముల నడంచుకొనలేక గోవిందునితో—

"ఇవి దుస్ససేను వ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్విపోయి తక్కినయవి, కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలపవలయు నచ్యుత వీనిన్.

ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు తునియలై చెదటి రూ
పఱియున్న గని యెడు కాఱుఁ గాక
యలుపాలఁ బొనుపడు నట్టి చిచ్చే యిది
పెనుగదఁ బట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మను నొక విల్లెప్పుడును వహించు
కట్టివిక్రమంబు గాల్పనే యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగు గన్నారఁ
గానఁ బడయమైతి మేనిఁ గృష్ణ!

నెట్టన యిట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును గాలముఁ దీనికి నాఱుటెన్నడుం
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టువు నీవు దేజమునఁ బోల్చిన భర్తలు గల్గ నచ్యుతా!"

ఈ మాటలు సామాన్యముగా పంతము వచ్చినపుడు మన తెనుగు నెలఁత లాడునట్టివే.

ఈ ద్రౌపదీ పరాభవమును విన్నవాడెవ్వడును ప్రతీకారము మాని సంధి చేసికొనుమని చెప్పఁడు. ఈ వాక్యములు ధర్మరాజు శాంతిని భంగపఱచునవిగూడ. కావున అతనింగూడఁ గలుపుకొని "బన్నములు వడిన ధర్మనందనుండు నేను రాజరాజు పీనుంగు గన్నారఁ జూడవలయు" ననుచున్నది ద్రౌపది. ద్రౌపది కెంత యభిమానము! శత్రుతిరస్కృతి కామె కెంత పట్టుదల!! ఇట్టి గుణములు కలది కావుననే అరణ్యాజ్ఞాతవాసములు సలిపి నిర్వర్తిత ప్రతిజ్ఞలుగల మగలతో రాజ్యశ్రీ నందుకొన్నది. ధన్యురాలీమె. ఇట్టి తెగువగల మగువను సృష్టించిన బ్రహ్మ ధన్యుడు. ఆమెను వాఙ్మయలోకమున నద్భుతముగాఁ జిత్రించిన కవి ధన్యుఁడు.

మహాభారతపురుషులలో నింకను జెప్పదగ్గవారు పెక్కురున్నారు. అయినను అప్రధానపాత్రల విమర్శనము మనకు ప్రధానముకాదు. ఏకలవ్యుడు, అభిమన్యుఁడు, ఘటోత్కచుడు, బలరాముడు, ద్రుపద విరాటులు, ధృష్టద్యుమ్నాదులు, విదురుడు, మున్నగువారు ఉత్తమవీరులు మహనీయగుణులును. ఏకలవ్యునికి మాత్రము తీఱని యన్యాయము జరిగినది. అయినను అతనిగురుభక్తి కాతడే సాటియైనాడు. బలరామాదుల యభిప్రాయములు వేరైనవి. నానా సంస్కార

ములు, వివిధశక్తులు, పలుగుణములు గల బహుళపాత్రములచే మహాభారత కథావృత్తము సుందరము బహుళార్థ బంధురము నైనది.

"అమితాఖ్యానక శాఖలం బొలిచిన" యిమ్మహేతి హాసము పాండవుల కీర్తిని ప్రకటించుటతోఁబాటు రాముఁడు, నలుఁడు, సత్యవంతుఁడు మున్నగాఁగల యనేక జనపతులచరిత్ర ములను గూడ జనుల కెఱింగింపఁ బూనినది. ఇందలి యొక్కొక్క కథ యొక్కొక్క ధర్మ సూక్ష్మమును వివరించుటకై విస్తరింపఁ బడును. కథోపాఖ్యానముల మూాల మున వైదికధర్మములను బ్రవచించుట, వర్ణాశ్రమధర్మము లను బోధించుట మహాభారతము చేయఁబూనిన పని. కవి యిందు లేనివిషయము వేఱొక గ్రంథమున లేదనియు, నితరము నందున్న దిందుండి తీఱునవియుఁ జెప్పుచున్నాడు.

> "అమల ధర్మార్థ కామమోక్షముల గుఱిచి
> యొలయు తెఱువెద్దియును నిందుఁ గలుగునదియ
> యొండెడలఁగల్గు; దీన లేనిండు చొప్ప
> దక్కొకంటను లేదు వేదజ్ఞులార!"

ఇట్లనుటచేత నీ గ్రంథముయొక్క సమగ్రత తెలియఁ బడుచున్నది. మఱియు దేవదేవుఁడగు వాసుదేవుని క్రీడా విశేషముల వివరణముగూడ నిందుఁ బ్రధానస్థాన మాత్ర

మించినది. భారతములోని తక్కినపాత్ర లొక యెత్తు, శ్రీకృష్ణపాత్ర మొకయెత్తు. అవతారపురుషుడుగా లెక్కింపఁ బడిన యాతఁడు భారతనాటకము నంతయు సూత్ర ధారుఁడై నడుపును. ద్రౌపదీ మానసంరక్షణము సేయుట లోను, విశ్వరూపమును జూపుటలోను, సైంధవ వధ యందును ఇంక నితరములగు నా యా ఘట్టముల యందును, ఈతడు దివ్యత్వమును బ్రకటించినాడు. కృష్ణునకు పాండవ పక్షపాత మున్నట్లు కన్పట్టును. దానిని పాండవపక్షపాత మనుట కంటె ధర్మపక్షపాత మనుట లగ్గేమో. అట్టి పక్షపాతమే వానికున్న అభిమన్యునివంటి వీరశిఖామణిని – మేనల్లుని యెరిఁగి యెరిఁగి యేల చంపనిచ్చును? అట్టి యుపద్రవమును నివా రించుకొనఁ జాలఁడా? కావున స్థితప్రజ్ఞుడగు శ్రీకృష్ణునకు అహంకార మమకారములుగాని, స్వపర విభేదముగాని, శీతోష్ణాది ద్వంద్వబాధగాని లేదు. ఆతడు సాక్షిమాత్రుఁడై వారివారి కర్మఫలముల ననుభవింపఁ జేసినాఁడని భావింప వల యును. ఈ విషయమును మన మనేక సందర్భములందు సమన్వయించు కొనవచ్చును. ఇట్టి తత్వకోవిదుడు గావుననే యాతని ముఖమునుండి భగవద్గీతవంటి తాత్వికగ్రంథము వెలువడఁ జాలినది. గీతామృతదోగ్ధయైన శ్రీకృష్ణచంద్రుని రాజనీతికౌశలము, సమాజనిర్మాణ దక్షత, గృహనిర్వహణ ప్రకారము, బంధుమిత్రులయెడ నాతని ప్రవర్తనము, దుష్ట

నిగ్రహ శిష్టపరిపాలనములు లోకమున కెంతటి విజ్ఞానమునో పంచిపెట్టినవి. ఇట్లు భగవద్గుణవిశిష్టుడగు శ్రీకృష్ణుని సంకీర్తనము చేతను భారతము పూజనీయమైనదని వ్యాసమహర్షి "భగవాన్ వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః" అని వచించినాఁడు.

భగవద్గీతవంటి తత్త్వశాస్త్రము భారతాంతర్భూతమగుటయు భారతప్రశస్తికి మూలమే. భారతము పంచమ వేదమని కదా ప్రసిద్ధి నందినది. అట్టి వేదమునకు తత్సారభూతమగు నుపనిషత్తొక్కటుండి తీఱవలయును. ఈ పంచమ వేదమునకు భక్తి జ్ఞాన కర్మ ధ్యాన యోగముల ప్రాధాన్యము నుద్బోధించు భగవద్గీతయే యుపనిషత్తు.

ధర్మజాదులు బాహ్యశత్రువుల నిగ్రహముతోఁబాటు అంతశ్శత్రు విజయమునుగూడఁ బొంది తరించుటయు నిందు ప్రధానాంశమే. కావుననే భారతములో ప్రధాన ప్రతిపాద్య రసము మోక్షకారకమగు శాంతమని ఆలంకారిక వతంసుడగు నానాందవర్ధనాచార్యుఁడు నిర్వచించియున్నాడు.

"మహాభారతములో సర్వ పురుషార్థ ప్రబోధము; సర్వరస గర్భత్వము నున్నదని వాచ్యముగాఁ జెప్పఁబడి నప్పటికిని, శాంతరస మంగియనియు మోక్షమునకే అన్ని పురుషార్థములలో ప్రాధాన్య మనియు వ్యంగ్యముగా వివ

రింపఁబడినది. పాండవాదుల చరిత్ర ముద్ఘాటింపఁబడినను అర్ధానిచేతను నిస్సారములగు విభూతులయందుఁగాని, నయ వినయ పరాక్రమాది గుణములయందుగాని సంసక్తులు కావల దనియు, పరమేశ్వరునియందే భావితాంతఃకరణులు కండనియు, సంసారముయొక్క నిస్సారతయే వ్యక్తీకరింపఁ బడినది. నిగూఢ రమణీయమగు నీ యర్థమును కవిబ్రహ్మయగు కృష్ణద్వైపాయనుడు భారతావసానమున హరివంశమును వర్ణించి స్పష్టీకరించియున్నాఁడు. సంసారాతీతమయిన తత్త్వాంతరమునందు భక్త్యతిశయమును గలిగించు నీ యర్థముచేతనే సమస్తమైన సాంసారిక వ్యవహారము పూర్వపక్షమైనది. పలువిధములైన దేవతాతీర్థ తపోనిష్ఠాదుల ప్రభావ వర్ణనము గూడ ఆ పరబ్రహ్మప్రాప్తికే యుపాయమైనది. పాండవాదుల చరిత్ర వర్ణనము వైరాగ్యజనన కారణమైనది. వైరాగ్యము మోక్షహేతువగుట, మోక్షము భగవత్ప్రాప్తి రూపమగుట ముఖ్యముగా గీతాదులయందు పరబ్రహ్మప్రాప్త్యుపాయమే సూచితమై పరంపరగా గోచరించెడిని. ఈ విధముగా భగవద్వ్యతిరిక్తమై సమస్తమునకును అనిత్యతను నిరూపించు మోక్షలక్షణమైన పరమపురుషార్థము, తృష్ణాక్షయ సుఖపరిపోష లక్షణమగు శాంతరసము అంగిభూతములుగా సూచితములైనవి. అత్యంత సారభూతమైన యీ యర్థము వ్యంగ్యముఖముననే నిరూపింపబడినది. సారభూత

మగు నర్థము వ్యంగ్యముచే ప్రకాశితమై యొప్పును గాని; సాక్షాచ్ఛబ్దముచే నిరూపించిన నొప్పదు."

కవిత్రయము

ఆంధ్ర భారత మవతరించినది పదునొకండవ శతాబ్ద ప్రారంభమున. ఆనాటికి సాటిదేశభాషలగు తమిళ కర్ణాటక ములలో గ్రంథములు వెలసినవి. కాని తెలుగున మాత్రము ప్రసిద్ధి కెక్కని దేశికవితలు తక్క శాస్త్రీయమగు మార్గకవిత వెలువడ లేదు. మఱియు ఆకాలమున జైన బౌద్ధ మతములు గూడ ఆంధ్రదేశమున ప్రచారములోనుండి హైందవ మతౌ న్నత్యమున కడ్డంకులను గల్పించుచున్నవి. ఈ కారణముల చేత వర్ణాశ్రమధర్మ రక్షణమే ప్రధానమని భావింపబడెడు హిందూమతమును రక్షించుటకోసమై రాజరాజాశ్రితుడగు నన్నయభట్టు భారతము నాంధ్రీకరింప మొదలిడెను. ఈ యంశములు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగా రిట్లు వివ రించినారు—

"ఆ కాలమున నొక్క రాజ్యతంత్రముల యందకాదు. సంఘమతాది ప్రకృతులయందును గల్లోలములు ప్రబలి యుండినవి. విజాతీయులైన శత్రువుల దండయాత్రల వల్లనేమి, బౌద్ధ జైనాది మతముల వ్యాప్తిచేనేమి, వేదతిరస్కార భూయిష్ఠములైన కౌత్సచార్వాకాది వాదములచే నేమి

హిందూమతముయొక్క ప్రాణము లనదగిన వర్ణధర్మములు కష్టస్థితికి వచ్చినవి. రాజరాజుయొక్క పరిపాలనము బ్రాహ్మణ మత పునరుద్ధారణకాలముతో సమన్వయించినది."

"రాజరాజెట్టి మాహాత్మ్యము కలవాఁడనగా— 'వివిధాగమ విహితశ్రముఁడు, సమస్తవర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిముడు, విప్రకులము నెల్లఁ బ్రోచుచు నగ్రజన్ము లకు ననుగ్రహమున మహాగ్రహారంబు' లిచ్చువాఁడు. దీనికి దార్కాణముగా మనకు దొరకిన వీని ముఖ్యశాసనము లన్నియు బ్రాహ్మణదానశాసనములే."

"బౌద్ధులు జైనులు మొదలగు వేదనిరాకరణవాదులు తమ తమ మతములలో జనులను జేర్చుకొనవలయునను నుద్దేశ్యముతో మాతృభాషలో గ్రంథములు వ్రాసి వానికి వ్యాప్తిని ప్రసిద్ధిని బడసి యుందురు. బౌద్ధుల గ్రంథము లనేకములు మాగధి యను ప్రాకృతభాషలో వ్రాయబడి యుండుట దీని కొక దృష్టాంతము. ఆంధ్రులలో ననేకులు బౌద్ధ జైనమతముల నవలంబించినవారై బ్రాహ్మణ మత మును విసర్జించి యుండుట సుప్రసిద్ధము. అన్యమతముల నవలంబించినవారో, వానియం దభిమానమును దాల్చినవారో యైన యీ జనుల, మఱల హిందూమతములో జేరువారినిగా జేయవలయునన్నను, ఉండుహిందువులను తమ వర్గమును వదలి పోకుండున ట్లుంచవలయునన్నను, దేశభాషామూలక ప్రచు

రణము లవసర మయ్యెను. ఇదియ యాంధ్రవాఙ్మయ సృష్టికి మూలకారణమని నా యూహ.

శ్రీ రామలింగారెడ్డిగారు రాజరాజనరేంద్ర వర్ధంతి మహోత్సవములో చేసిన అధ్యక్షోపన్యాసములోని పై వచనములు ఆంధ్రభారతోత్పత్తికిఁ గల కారణములను గొంత వరకు సూచించుచున్నవి. అవి శుద్ధసత్యములే యైనను దేశభాషయందు గ్రంథములను సృజించు నిచ్ఛయు నన్నయ భట్టారకునికి లేకపోలేదు. తమకు దగ్గఱగానున్న తమిళ కర్ణాటాంధులలో గ్రంథరచనము సాగుచుండ తెలుగు వెనుక బడుట యాతని కెట్లిష్టమగును? అందుకే—

"స్వస్థాన వేషభాషాభిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః
లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చాన్య దపహాయ"

స్వదేశ వేష భాషలయం దనురాగము గలవారై రసదృష్టితో సంస్కృతకావ్యములనే గాక వైకృతకావ్యములనుగూడ నభిమానించు చున్నారని నన్నయ నుడివినాడు. మొత్తముమీద చాళుక్యరాజుల యాశ్రయమున నన్నయ వంటి వైదికాగ్రేసరునిచేత తెలుగుకవిత్వము రూపురేకలు దిద్దుకొన్నది.

నన్నయభట్టు, రాజరాజు కులబ్రాహ్మణుడు. బ్రహ్మాండాది నానాపురాణములఁ జదివినవాఁడు. లోకజ్ఞుడు. ఉభయ

భాషా కావ్య రచనాభి శోభితుడు; సత్ప్రతిభాభియోగ్యుడు, మర్త్యమరాధిపాచార్యుడు. ఈ విశేషము లన్నియు నన్నయయే స్వయముగాఁ జెప్పుకొనినాడు.

నన్నయభట్టు కవిత్వము రెండువంతుల సంస్కృత పదములు నొకవంతు తెనుగుపదములు గలిగి నిరర్గళమగు ధారతో నొప్పుచుండును. దీర్ఘదీర్ఘములగు సంస్కృత సమాసములను వాడినను అర్థకాఠిన్యముగాని, పఠనబాధగానియుండదు. పద్య మర్థము కాకపోయినను వినుటకు సొంపై వీనుల తేనెలు గురియించును.

"సారమతిం గవీంద్రులు ప్ర
సన్న కథాకలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు
లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి
నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన
బంధురు డయ్యె జగద్ధితంబుగన్."

నన్నయగారు లోకము నాకర్షించు నేర్పుగల కవి. తన కావ్యమును సామాన్య కవులుగాక కవీంద్రులు మేలన వలయునట. వారును తన ప్రసన్నకథాకలితార్థ యోగమును

గాంచి మెచ్చవలయును. ఇఁక తక్కినవారో అక్షర రమ్యత నాదరింప వలయును. కవిత్వమున కుండవలసిన ప్రధానలక్షణ ములలో పైవి రెండును ముఖ్యములని యియ్యాదికవి భావించినట్లు స్పష్టమగు చున్నది. ఈనాటి కొందఱి కవులు వలె లోకమున కుపయోగించినను లేకున్నను, కవులు తల లూపినను ఊపకున్నను నా సంతోషముకోసము నేను కావ్య మల్లుకొందు నను స్వభావము కాదు గాబోలు నన్న య్యది. అందుకే కవులలోను—ప్రజలలోనుగూడ నాదరము నాతిఁ డభిలషించినాడు.

నన్నయ్యకు భారత రచనములో నెక్కువగా సాయ పడినవాడు నారాయణభట్టు. కృతజ్ఞతాబుద్ధి గల నన్నయ్య ఆతని మేలును మఱువక కొండంతగా వానిని గొండాడినాడు:—

> "పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నా
> రాయణునట్లు దానును ధరామర వంశవిభూషణుండు నా
> రాయణభట్టు వాఙ్మయ ధురంధరుడుఁ దన కిష్టుఁడుఁ సహా
> ధ్యాయుడు నైనవాఁ డభిమతంబుగ దోడయి నిర్వహింపగఁ."

నారాయణభట్టును గృష్ణునంతవానిం జేసి పొగడుట నన్నయ సచ్చారిత్రమునకు దృష్టాంతరము. కాని అథర్వణా చార్యుని భారతవిషయమున నన్నయ ద్రోహము చేసినాడ నియు, నది కారణముగా నన్నయ్యకు బిచ్చిపట్టి భారత రచన మాగిపోయిన దనియు కొందఱు విమర్శకులు తలంచు

చున్నారు. సత్యము దేవు డెఱుంగ వలయును. నన్నయ్యలో కృతజ్ఞతాబుద్ధితో బాటు వినయము నున్నది. భారతావతారికలో నాతఁడు "నీయనుమతంబున విద్వజ్జనుల యనుగ్రహంబునం జేసి నానేర్చు విధంబున నికావ్యంబు రచించెద". అని చెప్పుకొనినాడు.

నన్నయగారి సంస్కృత సమాస భూయిష్ఠమగు శైలి కీ దిగువ పద్యమును జిత్తగింప వచ్చును.

"బహువన పాదపాబ్ధి కుల
పర్వత పూర్ణ సర స్సరస్వతీ
సహిత మహామహీభర మ
జస్ర సహస్ర ఫణాళిఁ దాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధి
శాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డ
నంతుడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్."

ఈ కవి తన ప్రతిజ్ఞ కనురూపముగా ప్రసన్నకథా కలితార్థయోగమును అక్షర రమ్యతను బాగుగా పాటించినాడు. ఆ యా కథలను నడపించుటలోను వర్ణించుటలోను, ఉచితములను దీసివేయకయు, అనుచితములను దొలగించియు చక్కని కావ్యకళామార్గమున కాచార్యుడై యొప్పెను. ఈ యంశములు నలోపాఖ్యానము, సౌపర్ణాఖ్యానము,

మున్ముగు కథాసందర్భములందు గాంచగలము. సంభాషణ లను జేయించునపుడును, విషయమును బ్రధానముగాఁ జెప్పించు నప్పుడును—లలితములైన జానుతెనుగు పదములతో నీతడు కావ్యరచనము సాగించును. దేవయాని యయాతిని పెండ్లాడు ఘట్టములోని యీపద్యము జూడుడు:—

"నన్ను వివాహమై నహుషనందన యీ లలితాంగిఁదొట్టి యీ
కన్నియ లందఱుం దివిజ కన్యలతో సరియైనవారు నీ
కున్నతిఁ బ్రీతి సేయఁగ నృపోత్తమ వాసవుఁబోలి లీలతో
నిన్నరలోక భోగము లనేకము లందుము నీవు నావుఁడున్."

నన్నయ సీసములనుగూడ మెత్తనైన పదములతో నర్థసారళ్యమునకు భంగము రానీక హృదయంగమముగా వ్రాయును. ఒక్క—యుదాహరణము—

"ధర్మార్థ కామసాధన కుపకరణంబు
గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకం బన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూత
గౌరవంబున కేక కారణం బున్నత
స్థిర గుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము

ఱెట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టి తీరములను మట్టబడిన
వంతలెల్లఁ బాయు నింతులఁ బ్రజలను
నొనరఁ జూడఁ గనిన జనుల కెంము."

ఇవి శకుంతల దుష్యంతుని గూర్చి పలికిన పలుకులు.

తెలుగులో పద్యవిద్యకు నన్నయ యాద్యుఁ డయినట్లు గద్యవిద్యకును నాద్యుఁడే. ఈతని గద్యము సమాస భూయిష్ఠము లేక యలఁతి యలఁతి పదములతో సుందరముగా నుండును. తెలుగులో మేటి వచన రచయితయగు చిన్నయ్యసూరి యీ నన్నయ నుండియే తాను వచనము వ్రాయ నేర్చినా డనవచ్చును. ఇరువురి శైలియు నొక్క పోలికగనుండి మాధుర్యమును వెలార్చును. ఇందు కీ దిగువ వచనభాగమును గాంచునది:—

"తొల్లి దేవేంద్రుఁండు గొండొక కాలం బదృశ్యుండై యుండిన, నతనిం గానని శచీదేవి శోకింపం బోయిన నుపశ్రుతిం జేసి బృహస్పతి దానికి దేవేంద్రాగమనంబు సెప్పెనని వేదవచనంబుల వినంబడుం గావున నేను నుపశ్రుతిం జూచితి నిది తప్పదు. పాండవులు పరలోక గతులు గారు. పరమానందంబున నున్నవారు. వార లెందుండియు నిందులకు వత్తురు. నీవును సుచిత్తుండవై స్వయంవరం బిప్పురంబునం జాటింపం బంపుము."

మధ్య కాలపు వచనరచన మధ్యాహ్న మయినది. దీర్ఘ తర సమాసములతోడను, కొండవీటి చేంద్రాడులను బోలిన నిడుపైన వాక్యములతోడను ప్రాబంధిక కవులు వచనమును హత్య చేసిరి.

నన్నయభట్టునకు యజ్ఞ దాన తపోవ్రతముల యందును, బ్రాహ్మణులయందును ప్రీతి మెండు. ఆ దృష్టి భారతములో నడుగడుగునకును బొడకట్టును. ఏసందర్భము నందైనను తాను చేసికొని యజ్ఞములు, దానములు, వ్రతములు బ్రాహ్మణ సంతర్పణములు నీతడు తఱుచు చేయించు చుండును.

"అమల సువర్ణశృంగ ఖుర
మై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేద విప్రులకు
దానము చేసినఁ దత్ఫలంబు త
ద్యమ సమకూరు భారత క
థా శ్రవణాభిరతిన్..."
"...విప్రకులము నెల్లఁ బ్రోచుచు
అగ్రజన్ములకు ననుగ్రహమునఁ
జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు"
"ఇవి యేనుకా సతతంబు నాయెడ కరం
బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణ మహీ
యః ప్రీతియున్..."

ఇట్టివి నన్నయ్య భారతమునుండి వేనకువే లుదాహ రింప వచ్చును. ఇట్టి బ్రాహ్మణాభిమానముతో నీతడు కొన్ని తావుల మూలాతిక్రమణమును సైతము చేసినాడు. అట్టి వాని నీ చిన్ని పాత్రమున నుదాహరింపగాదు.

భారతీయుల ప్రాచీనవాఙ్మయములో బ్రాహ్మణాధిక్య మెక్కువగా వర్ణింపబడి యున్నదని విమర్శకు లనుచున్నారు. దేశకాల పరిస్థితులను బట్టియు గుణోత్కర్షను బట్టియు నప్పటిలో నయ్యది యట్లు జరిగినది. నన్నయ భట్టారకునిలో నా బ్రాహ్మణాభిమానము ఉండవలసిన దానికన్న కొన్ని పాళ్లెక్కువగా నున్నదని ఆంధ్రభారత విమర్శకులు పెక్కురు వ్రాసియున్నారు. కవి రసౌచిత్యమును బాటించి గావ్యకళా దృష్టితో మార్పులు చేర్పులు చేయువచ్చునుగాని, ఒక మాతృకను దెనుగుచేయునప్పు డిట్టి స్వాతంత్ర్యమును బూను టంత మంచిదికాదని సహృదయుల తలంపు. అయినను ఇది నన్నయ్యగారి లోకోత్తర కవితాప్రతిభలో చందమామ వెన్నెలలో నాతనిమచ్చ మునిగిపోవునట్లు గణనకు రాదు. ఆదికవి కథాసంవిధానములందును, ఆయా రసఘట్టములం దును మూలభారతములోని న్యూనాధిక్యములను సవరించి మహాకవిత్వ సామర్థ్యము నగపఱచిన భాగము లెన్నియో బొడకట్టును. ఇట్టి గుణవిశేషములచేతనే యిమ్మహాకవి

ఆంధ్ర మహాకావ్య సృష్టి కాదిమ బ్రహ్మయయి నన్నె కెక్కినాఁడు.

కవిత్రయములో నన్నయభట్టారకునకిఁ బిమ్మట పేర్కొన దగినవాఁడు ఉభయకవిమిత్రుడు, కవిబ్రహ్మయునగు తిక్కన సోమయాజి. ఈతడు నెల్లూరును పాలించిన మనుమసిద్ధి యాస్థానమున మంత్రిగను, కవిగను నుండి పదుమూడవ శతాబ్దపు మహాకవీంద్రుడుగా వన్నె కెక్కి తెలుగువారి కారాధ్యుడైన మనీషి. హరిహరనాథ భక్తుడు. బహు శాస్త్ర పారంగతు డగుటయేగాక రాజనీతిలోను, లౌకిక విషయములలోను సాటిలేని ప్రజ్ఞగలవాడు. "సారకవితాభి రాముడును గుంటూరువిభుడును నగు మంత్రి భాస్కరుని" మనుమడు. మొట్టమొదట నిర్వచనోత్తర రామాయణమును వ్రాసిన యిమ్మహాకవి యజ్ఞము చేసి సోమయాజియై పరమార్థదృష్టి ప్రేరేప భారతములోని పదునేను పర్వము లను దెనుగుచేసి యిష్టదైవమగు హరిహరనాథుని కంకితమిచ్చి ధన్యుడయినాడు. తాను ధన్యుడగుటయే కాదు. ఆంధ్రావళి మోదముం బొరయ వారినిగూడ నుత్తమ కావ్యప్రదానము చేత ధన్యుల నొనర్చినాడు.

నన్నయ రచనము సంస్కృతభూయిష్ఠము కాగా తిక్కనగారిది తెలుఁగుతో నిండిపోయినది. రెండువంతులకు పైబడిన తెనుగు పదములతోడను నొకవంతు సంస్కృత పద

ముల తోడను నిమ్మహాకవి యాంధ్రమహాభారతమును రచించి నాడు. తిక్కన తెలుగుబాసను విరివిచేసి తెలుగుకవి బ్రహ్మ యను బిరుదమునకు తగిపోయినా డనవచ్చును. అవసర మైనచో సంస్కృతముగూడ వలసినంతగా వాడుకొను చొరవ యిక్కవికి గలదు. ఇందుకు దృష్టాంతముగా దిగువ పద్యము దిలకింపుడు—

"దుర్వారోద్యమ బాహువిక్రమ కళా
స్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన వి
ద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేగుదెంచి నిను దో
ర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానము( బ్రాణముం గొనుట త
థ్యం బెమ్మెయిం గీచకా."

ఈ పద్యము తన్ను మోహించిన కీచకుని ద్రౌపది బెదరించు ఘట్టములోనిది. పద్యములోని ఆరభటీ శైలి, సమాసబాహుళ్యము, సంస్కృతపదముల బిగువు; కొట్టవచ్చి నట్లుండి సమయోచితముగాఁ గీచకుని భయపెట్టజాలిన ట్లున్నవి.

తిక్కనమహాకవి కథను తీర్చిదిద్దుటలోను, ఆ యా పాత్రలపై మనకు సానుభూతి గలుగునట్టి వర్ణనములు సేయుట

లోను అసమానుడు. అనౌచిత్యమును రవ్వంతయైనను రానీక యీయన కావ్యనిర్మాణము సేయును. ఇందుకు విరాటోద్యోగ పర్వములు సాటిలేని యుదాహరణములు. విరాటములోని కీచకవధాఘట్టమేమి, ఉత్తర గోగ్రహణమేమి, ఉద్యోగము లోని రాయబార ఘట్టములేమి, ఒక దానినిమించి మఱియొకటి ఔచిత్యమునకు జీవగఱ్ఱలు. దిగువ పద్యములోని ద్రౌపదీవర్ణన మెంత సొంపు నింపుచున్నదో చూడుడు—

"గండుమీలకుఁ బుట్టి కాముబాణములతోఁ
కలసి యాడెడునట్టి కన్నుఁగవయు
బిసకాండములశిక్షఁ బెరిగి లేఁదీవల
మెచ్చక యున్నట్టి మృదు కరములు
చిగురులతో సంధిచేసి యంబుజముల
పైనెత్తి చనునట్టి పదతలములు
కలకంఠములచేతఁ గఱచిన విద్య వీ
ణల కిచ్చునట్టి తిన్ననియెలుంగు
నత్తెఱంగున రేఖయు నవ్విధంబు
గఱువ చందంబు నమ్మెయి కలికితనము
నట్టి చెన్నును సైరంధ్రియంద కాక
కలవె యొరులకు నెఱుఁగక పలికి తబల?"

ఇందు వర్ణనీయ వస్తువును రెండేసి యుపమానములకుఁ జోడించి కవి మహనీయము చేసియున్నాఁడు. తిక్కన్నగారి

చేతిలో ద్రౌపది చక్కగా తీర్చబడ్డది. రాజపుత్రియగు నామె రాజసము కార్యఘటనాశక్తి అద్భుతములు. కీచకునిచే బరాభూతయైన పిమ్మట నామె భీమసేనునికి తనపాటు చెప్పి ప్రేరేచు ఘట్టము ఎంతయు నొప్పియున్నది.

"నన్నుఁ బరాభవించి సద
నంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు తప్పక సు
ఖోచిత శయ్యను నిద్ర సేయ నీ
కన్ను మొగుడ్చు నూఱటకుఁ
గారణ మెయ్యది భీమసేన? మీ
యన్న పరాక్రమంబు వల
దన్న నొకో దయమాలి తక్కటా?"

అగ్నిసాక్షిగా పెండ్లాడిన యిల్లాలిని అనదగా దలంచి పరపురుషుడు చెప్పరానిపాటు పఱచగా సుఖముగా నిద్రించు మగ డెంత మందు డనవలయును. "కీచకుడు మున్నున్నరూపు గోల్పడక సుఖముగా నిద్రించుచుండ నీకు కంటికెట్లు నిద్ర వచ్చినది! కంటకుడైన శాత్రవు డున్నప్పుడు వీరశిఖామణికి కంటికి నిద్ర రావచ్చునా మఱి? నీ వంటివాని పత్ని నట్టిపాటు పఱచిన యాత డింకను ప్రాణములు గోల్పోవకుండుట నీకు సిగ్గుగాదా" యని యందలి ధ్వని. ఇందు భీమసేనుని కోపము నెక్కసక్కెము చేసి మండించినది ద్రౌపది. అన్నపరాక్ర

మంబును బ్రశంసించుటచేత తదాజ్ఞాబద్ధుడ వైతివా యనియు నుపాలంభము. మఱియు ఈ అన్న ప్రస్తావన లోగడ పరాభ వములం దాతడు చూపిన ఓర్పునుగూడ స్మృతికిదెచ్చి ఆయన మన కనుసరణీయుడుకాదని సూచించు చున్నది.

తిక్కనగారు ఆ యా పాత్రముల కుచితము లగునట్లు సంభాషణలు చేయించుటలోను, తాను వర్ణనల నెఱపుట లోను కథాచిత్రణమునందును మిక్కిలి దిట్ట. ఉద్యోగ పర్వమునం దీ విషయము అడుగడుగునందును బొడకట్టును. శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని గూర్చి తుదిమాటగా ననుచున్నాడు.

"వారలు శాంతశూరులు భ
వచ్చరణంబులు గొల్వఁ బూనియు
న్నా రటుగాక మీకది మ
నంబున కప్రియమేని నింతసం
బోరికి వచ్చుచుండుదురు
భూవర రెండు దెఱంగులందు నీ
కారయఁ బథ్యమేది యగు
నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా!"

ఇందలి మాటలపొంక మెంత సమయోచితముగను సరసముగను నున్నదో చూడుడు. మితములు నుచితములు నగు మాటలచేత నమితార్థమును దోపఁజేయుట తిక్కన్న

లోని యొక విశేషము. ధృతరాష్ట్రుడు సంజయుని పాండవుల యొద్దకుఁ బంపుచు నుడువు పల్కులు—

"నెయ్యము వాటించి కడుం
దియ్య మెసఁగ నలుక లెల్లఁ దీఱునటులుగాఁ
గయ్యమనుతలఁపు లోనుగ
నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగునన్.

వ. శాంతిప్రకారంబునఁ గార్యంబునడపి యొక్కటియై మనుట యొడఁగూర్చి రమ్ము. రథంబెక్కి పొమ్మని తగిన తెఱంగున వీడ్కొలిపె."

పై పద్యము మహాభాష్యము వ్రాయ ననువైన యొక సూత్రమువలె నున్నది. తిక్కనమహాకవి వచనముగూడ పద్యమువలె వ్యర్థపదములు లేక, సమాసాడంబరము ప్రాపు వోక, రసభావానుగుణమై యొప్పుచుండును. ఏల యుండదు? "మహాకవిత్వ దీక్షావిధి నంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్" అని ఆతడే చెప్పుకొన్నాడు గదా!

ఇమ్మహాకవి మంత్రిమణియై వన్నె కెక్కినాడు గావున రాజనీతివిశేషము లద్భుతముగా వివరింపగలడు. ఉద్యోగ పర్వములోని రాజనీతియు, యుద్ధపంచకములోని సమర విధానములును ఈత డనుభవైక వేద్యముగా రచించిన రచన లనవచ్చును. నన్నయలో వైదికత మిక్కుటముగా ప్రకా

శించిన ట్లీయనలో రాజనీతి చాతుర్యము, సేవాధర్మాదులు రాజకుటుంబ సహజములగు మర్యాదలు నెక్కువగా తేజరిల్లును.

ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు లెఱింగించుచు నిట్లనుచున్నాడు—

"ఎండకు వానకోర్చి తన
యిల్లు ప్రవాసపుఁ జోటు నాక యా
కొండు నలంగుచుఁ నిదుర
కుం దఱి దప్పెడు దప్పి పుట్టె నో
క్కండన యెట్లొకో యనక
కార్యము పుట్టినచోట నేలినా
తం డొక చాయ చూపినను
దత్పరతం బనిసేయు టొప్పగన్".

సేవాధర్మమునందలి కష్టనిష్ఠురము లిందెంత రమ్యము గను సత్యముగను వర్ణింపబడినవో చూడుడు. ఈ కష్టము లీనాడు ప్రభుత్వ సేవ యొనర్చు పెక్కుర కనుభవము లోనివే, తిక్కనమహాకవి కవితా చాతుర్యమునుగూర్చి యీకొలదిపుటలలో చర్చించుటకు వీలుగాదు. రేఖామాత్ర ముగా నుదాహరణము లిచ్చితినేకాని యిది యీయన కవితను విమర్శింపఁ దగిన తావు గాదు.

మహాకవియగువాడు తన కృతులద్వారమున తాను తరించుటయేకాక తత్పాఠకులను, ఆదేశమును గూడ తరింపజేయవలసి యున్నాడు. ఇట్టి శుభలక్షణములు మహాకవియగు తిక్కనలో లేకపోలేదు. తాను రచింపబూనిన గ్రంథపు ప్రాశస్త్యము నాతడు గమనించి యది లేఖ్యమైన యామ్నాయ మనినాడు. మనవారి దృష్టిలో ఆమ్నాయము జన్మము తరింపజేయునదియే కదా! అట్టి యామ్నాయమును దెనుగొనరింప బూనుకొన్నప్పుడు హరిహరనాథుడే స్వయముగావచ్చి కృతిపతిత్వము స్వీకరించినాడట. ఎంత యదృష్టము! అట్టి యదృష్టము పట్టినందుకు దగినట్లుగా అమ్మహాకవి కోర్కియు భవబంధముల ద్రెంపుకొన జూచినది. ఆ హరిహరనాథునకే యంకితమిచ్చి సర్వసిద్ధినంది భక్తకోటికి వరణీయుడైనా డీ మహాజ్ఞాని.

"ఇంతకు నేర్చు నీకు నొక
యింతటిలోన మదీయవాణి న
త్యంత విభూతిఁ బెంపెసగు
నట్టి నిమం గొనియాడఁ జేత దా
నెంతటి పెద్ద నీకరుణ
నిట్లు పదస్థుడ నైతి నింక జ
న్మాంతర దుఃఖముల్ దొలఁగు
నట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే!"

"ఇట్టి పవంబు గాంచి పరమేశ్వరునిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బూజ్యమూర్తియగు భారతసంహితఁ జెప్పఁగంటి నా
పుట్టు గృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టిద పట్ట మప్రతిమ కారుణికత్వ మహావిభూతికిన్.

"కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగుం జనా
భ్యర్చితమైన భారత మపార కృపా పరతంత్రవృత్తి మైఁ
జేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్."

వ. ఇది యనన్యసామాన్యాకారంబగు పరమధర్మ ప్రకారంబు.

" కావున భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావళి మోదముం బొరయు నట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధి నంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్."

ఇట్లు తిక్కన తన కవితాశక్తిని జన్మాంతర దుఃఖములు దొలఁగ సాధనము చేసికొన్నాడు. అసదృశమగు కృతిని రచించి ఆంధ్రుల కర్పించి వారికిని తారకమార్గము చూపినాడు. పై పద్యములలో "నా నేర్చిన భంగిఁ జెప్పి" అనునది తిక్కన్నగారి వినయమును సూచించు చున్నది. నన్నయయు నట్లే యనినాడు గదా! ఈ వినయ గుణము మహాపురుషులకు ముఖ్యలక్షణము గాబోలు.

నన్నయ తిక్కనలను స్మరించి కవిత్రయములో మఱొక్కడగు నెఱ్ఱాప్రెగ్గడను విడిచినచో నీ వ్యాసము సమగ్రము కాదు. కావున యెఱ్ఱన కవిత్వమునుగూడ నించుక చవి చూతము.

శంభుదాసుడను బిరుదమునందిన యిమ్మహాకవి తిక్కన కేబది సంవత్సరములు పిమ్మటివాడు. లోకోత్తరమగు కవిత్వ పాటవముచే ప్రబంధపరమేశ్వరుడని యీతడు పేరుగాంచెను. ప్రబంధరచన కనువగు మార్గము లీయన కవిత్వములో నుండుటంజేసి యీతడు ప్రబంధపరమేశ్వరు డాయెను. ఈతని కవితా వైభవము ఆరణ్యపర్వ శేషమునందుకన్న "హరివంశము"లో నెక్కువగాఁ గాన నగును.

సంస్కృత భూయిష్ఠమైన నన్నయ్య కవిత్వమునకును, తెలుగుతో నిండిన తిక్కన్న కవిత్వమునకును మధ్య - ఆరణ్య పర్వశేషమున నీతని రచనము సాగవలసియున్నందున నీతడు సంస్కృతాంధ్రములను సమానముగా నభిమానించి భారత భాగమును పూరించినాడు. అట్లు కాకున్న నీయన రచనము అటు నన్నయ రచనలోను, ఇటు తిక్కన రచనలోను కలియదు. పెక్కు వర్ణనలయందును, కవితారీతుల యందును అలంకార నిబంధనమునందును నెఱ్ఱన నన్నయనే యనుసరించి "తత్కవితారీతియుఁ గొంత తోఁప, తద్రచనయ కా" రచించెను. ఎఱ్ఱన స్వయముగా నప్రతిమాన ప్రతిభాశాలి

మైనను నన్నయ రచనములో తన రచనమును గలుపవలసి వచ్చి నందున కొంత స్వాతంత్ర్యము నడంచుకొనక తప్పదయ్యెను. భారతములో నన్నయగారి చివరి పద్యము—

"శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవ కైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై."

ఎఱ్ఱనయొక్క మొదటిపద్యము:—

"స్ఫుర దరుణాంశురాగ రుచిఁబొంపిరి వోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్ల న
ద్ధుర తర హంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁ గా
గరము వెలింగె వాసర ముఖంబులు శారదవేళఁ జూడఁగన్."

ఈ రెండుపద్యములందును పదముల కూర్పులోనేమి, శైలిలోనేమి, వర్ణనవిధానములోనేమి యెంతయో సాదృశ్య మున్నది. ఇట్టి సాదృశ్యములు ఇతని కవితలో పెక్కులున్నను ప్రత్యేకత గోచరింపకపోదు. సావిత్ర్యుపాఖ్యానము మున్నగు ఘట్టములందు ఎఱ్ఱన ఎంతగానో స్వప్రతిభను బ్రకటించును. ఎఱ్ఱాప్రెగడ శైలి కుదాహరణముగా నీ దిగువపద్యముల చిత్తగింప వచ్చును.

"కమనీయ కమలినీ కల్లోల వీచులఁ
గదలు రాయంచల గతుల యొప్పు
బహుపుష్ప పల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తతుల సొంపు
మకరంద గసపాన మద విలోలంబులై
క్రాలెడి యెలదేఁటి గముల యులివుఁ
బరిపక్వ మంజుల ఫల రసోద్ధతములై
పలుకు రాచిలుకల పటు రవంబుఁ
బ్రియుడు వేఱువేఱఁ బ్రీతిమై జూపుచుఁ
జెప్పుచును జనంగఁ జిగురుఁబోఁడి
కనుచు వినుచు నిర్వికార సల్లాసంబు
లార నతని తెఱఁగు నరయుచుండె."

ఇది సత్యవంతుడు సావిత్రికి వనదృశ్యములు చూపు ఘట్టములోనిది. ఇందు అకృత్రిమమగు కవితాశైలి, పదముల కూర్పు, వర్ణనవిధానము మనస్సునకు హాయిగొల్పుచున్నవి. తిక్కనశైలిని బోలిన తెలుగుపలుకుల కులుకునడక గలదీ దిగువపద్యము—

"ఎడపక వాఙ్మనఃక్రియల నేరికి హింస యొనర్పఁబూన రె
య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవన చూతు రిచ్చచోఁ
గడమ పడంగనీ రెదిరి కాంక్షితముల్ దుదిముట్టఁ దీర్తు రె
క్కుడు మదిఁ గూర్తు రాశ్రితులకుం వినుమిన్నియు నార్యధర్మముల్"

సంస్కృతపదములతో నిండి నిండారబారు నఖండ గోదావరి వడువున నడచుచున్న దిగువ పద్యముం గాంచుడు.

"కనియెం గోమల నీలమేఘ విలస త్కాలాంజనాకార ఘో
ర నిశాతోత్కట దంష్ట్రి నుజ్వల చలద్రక్తాక్షుఁ బ్రత్యగ్ర కాం
చన వర్ణాంబరు నంత్యకాల దహనజ్వాలా ప్రచండుఁ జగ
జ్జన సంత్రాసకు నొక్క దివ్య బటుపాశ ప్రౌఢ హస్తోద్ధతుఁ."

ఇది యమవర్ణనము. పద్యము వినుటతోడనే యముడు ప్రత్యక్ష మయినట్లున్నది. మహాకవియగువాడు రసభావములకు దగినట్లుగ ఆయాపదములను బొందించి సుందరముగా పద్యము నేని గద్యము నేని వ్రాయును. కవిత్రయములో నిట్టి మహత్వము వలసినంత యున్నది. వారి కవితా విమర్శనమునకు ప్రత్యేకముగా గ్రంథములే వెలువడ వలయును. ఇయ్యది వారి కవితారాజ్యము నలంతిగా తొంగిచూచుట గూడ యగునో కాదో చెప్పజాలను.

భారతము నాంధ్రీకరించినవారిలో నన్నయభట్టారకునకు సమకాలికుడో కొంచెము పూర్వుడోయగు నధర్వణాచార్యు డొకడు. ఈతని యాంధ్రీకరణములోని కొన్ని పద్యములను అప్పకవి యుదాహరించి యున్నాడు. వానింబట్టి చూచినచో అధర్వణాచార్యుని భారతముగూడ అద్భుతమైనదిగా నగపడుచున్నది.

## మూ డు కా వ్యా లు

ఆధునికులలో కవిసార్వభౌమ బిరుదాంకితులగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారును, భారతము నామూలా గ్రముగా దెనుగుచేసి యున్నారు. వీరి శక్తియు ప్రశంసా పాత్రమే. వీరి రచనముంగూర్చి యొక విమర్శకుడు "మూడు శతాబ్దులలో ముప్పురుకవులు చేయజాలిన పనిని మూడు దశాబ్దులలో నొక్కకవి చేసినా" డని ప్రశంసించి యున్నాడు. సత్యమేకాని, కావ్యముయొక్క గొప్పదనము కవితాగుణము లనుబట్టి యుండును గాని పద్యసంఖ్యనుబట్టి యుండదు. మఱియు వీరిది యథామాతృకమగు ననువాద మట,

ఏది యెట్లయినను మహాభారత మొక మహనీయమగు గ్రంథము. జీవితసమస్యలను చక్కగా విడదీసి బ్రతుకు బాటలలోని చీకట్లను బోనడచి వెలుగులు వెలార్చుట కిది పరంజ్యోతి. ఇది యిటీవల రష్యాభాషలోని కనువదింపబడుట గూడ భారతీయులకు గర్వకారణము కాకపోదు. కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారి కిద్దానిపై సాటిలేని యభి మానము. భారతముపై వీరు వ్రాసిన విమర్శ ఆంధ్రవాఙ్మయ మున కమూల్యభూష కాగలదని సహృదయు లాశించు చున్నారు.



# భాగవతము

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అను నైదు లక్షణములతోఁ గూడినది పురాణము*. ఇట్టి పురాణములు సంస్కృతభాషలో పదునెనిమిది గలవు. నాలుగు వేదములకు నుపవేదములున్నట్లే యష్టాదశ మహాపురాణములకు నుపపురాణములును గలవు.

పురాణములు సాధారణముగా త్రిమూర్తుల మహిమలను, అవతార విశేషములను నుగ్గడించుచు, దేశచరిత్రమును, నానారాజుల యితిహాసములను బోధించునవై యున్నవి. ఇట్టి పదునెనిమిది పురాణములలో భాగవతము సుప్రసిద్ధమైనది. భగవంతుని లీలలను వర్ణించునదగుట వలన దీనికి భాగవతమని పేరు గలిగెను. భగవచ్ఛబ్దము సామాన్యముగా బ్రహ్మవిష్ణీశ్వరులకుగూడ ననువర్తింప వీలున్నను ఈ గ్రంథములో భగవంతుడన హరియనియు, నాతని మహి

---

* 1 బ్రాహ్మము 2 పాద్మము 3 వైష్ణవము 4 శైవము 5 భాగవతము 6 నారదీయము 7 మార్కండేయము 8 ఆగ్నేయము 9 భవిష్యత్తు 10 బ్రహ్మకైవర్తము 11 లైంగము 12 వారాహము 13 స్కాందము 14 వామనము 15 కౌర్మము 16 మాత్స్యము 17 గారుడము 18 బ్రహ్మాండము. ఇవి మహాపురాణములు.

మలు గల యీ గ్రంథము భాగవత మనియుఁ బేరొ్కనిరి. భాగవతప్రసిద్ధిని, తదుత్పత్తి ప్రకారమును వర్ణించునొక కథను మనము భాగవత పురాణ ప్రారంభమునసే చదువఁగలము.

అష్టాదశ పురాణములను, భారతేతిహాసమును రచించిన వాడు కృష్ణద్వైపాయనుడే యని పెక్కుర విశ్వాసము. రాశీభూతమైయున్న వేదమును ఋగ్యజుస్సామాథర్వములని నాల్గుఁ దెఱంగుల విభజించియు, ననేకోద్గ్రంథములను విరచించియు వ్యాసు డాత్మశాంతిలేక వ్యాకులచిత్తుఁడై యుండెను.

“దీనవత్సలుండయిన వ్యాసుండు స్త్రీ శూద్రులకును ద్రైవర్ణి కాధములకును వేదంబులు విన నర్హంబులుగావు గావున మూఢులకెల్ల మేలగునని భారతాఖ్యానంబు సేసియు నమ్ముని భూతహితంబునందుఁ దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీ తటంబునందు నొంటియుండి హేతువు వితర్కించుచుఁ దనలో నిట్లనియె.”

వ్రతధారినై వేద వహ్నిగురుశ్రేణి
మన్నింతు విహితకర్మములఁ గొఱఁత
పడకుండ నడపుదు భారతమిషమునఁ
బలికితి వేదార్థ భావమెల్ల
మునుకొని స్త్రీ శూద్ర ముఖ్యధర్మములందుఁ
దెలిపితినేఁ జెల్ల దీనఁజేసి
యాత్మ సంతసమంద దాత్మలో వీక్షించు
సంతసింపకయున్న జాడదోఁచె

హరికి యోగివరుల కభిలషితంబైన
భాగవత విధంబుఁ బలుకనైతి
మోసమయ్యెఁ దెలివి మొనయదు సుఖచితి
ననుచు వగచుచున్న యవసరమున.

—భాగవతము ప్ర. స్కం.

వ్యాసుని వద్దకు నారదుఁ డేతెంచి యాతని మనో వ్యాకులత నెఱింగి—

"అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుకగాని విష్ణుకథ లేర్పడఁజెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నఁగాక నీకు నీ
కొంచము వచ్చుటెల్ల హరిగోరి నుతింపమి నార్యపూజితా!
హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచిభ్రాజితమైన మానస సరస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్య దుర్మలినవత్కాకోల గర్తాకృతిన్.
అపశబ్దంబులఁ గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వ పా
ప పరిత్యాగము సేయుఁగావున హరిన్ భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబుఁ గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్త్వజ్ఞ చింతింపుమా!"

నీ వెన్ని గ్రంథములం దెన్ని విధముల నుద్ఘాటించినను పుణ్యశ్లోకుడగు హరిచరిత్రములు ప్రధానముగాఁ గల గ్రంథమును వ్రాసినాడవు కావు. విష్ణుచరిత్రము లచ్చటచ్చట నీవు

వ్రాసిన పురాణాదులలో ప్రశంసితములై యుండవచ్చును. అయినను హరినిగూర్చి వర్ణింప వలసిన దింకను జాల కలదు. కావున విష్ణ్వాదంతములు ప్రధానముగాఁగల యొకపురాణ మును రచింపుమని ప్రబోధించెను. మఱియు నారదుడు విష్ణు భక్తుల సేవచేఁ దాను బొందిన యుద్గతి నెఱింగింపఁ దన పూర్వ జన్మవృత్తాంతమును సైతము వివరించెను. అటు పిమ్మట ద్వైపాయన మహర్షి భాగవతమును వ్రాసి యాత్మశాంతి యుక్తుడై తేజరిల్లినాడు.

పైకథ భాగవతోత్పత్తి ప్రకారమును సూచించుచు నితర దైవములకంటెను హరికిఁగల విశేషమును వ్యక్తము సేయుచున్నది. ఒకదృష్టితోఁ దిలకించిన నియ్యది విష్ణుదేవున కాధిక్యమును బ్రకటింప వ్రాయబడినట్లును స్పష్టమగును.

ఏ కథలయందుఁ బుణ్య
శ్లోకుఁడు హరిచెప్పబడును సూరిజనులచే
నా కథలు పుణ్యకథలని
యాకర్ణింపుదురు పెద్ద లతి హర్షమునన్.

బ్రహ్మ, ఈశ్వరుడు, మున్నగు దేవతలును సర్వశక్తి మంతులే యైనను సృష్టి స్థితి లయము లను మూడుకార్యముల కధినాథులుగా వర్ణింపఁబడిన దేవతలలో విష్ణుదేవునిది రక్షా కార్యము. జగద్రక్షాపరాయణుఁడగు విష్ణువే మోక్షప్రదాత యని హిందూమతములోని కొన్ని పౌరాణిక గ్రంథములు

చెప్పుచున్నవి గూడను. ఆ కారణమున శ్రీహరి మోక్షప్రదాత యనియు నాతని చరిత్రములు దురిత హరములనియు వర్ణింపఁ బడెను. పౌరాణిక యుగమున హరితో సమానుడుగనే వర్ణింపబడిన హరుడుగూడ సర్వజ్ఞత్వాదిగుణ విశిష్టుడుగను మోక్షప్రదాతగను జెప్పఁబడక పోలేదు. పెక్కు శైవపురాణములును, శైవాగమములును శంకరుని సర్వేశ్వరత్వాది కల్యాణ గుణములను సహస్రముఖములఁ గీర్తించి యున్నవి. మఱియు దేవీభాగవతాది పురాణములందు త్రిమూర్తులకుగూడ మూల జననిగా శక్తి వర్ణింపఁ బడుటయు గలదు. హిందూమతములో నున్న యీచిత్రమును, సర్వసమన్వయ దృష్టిని మన మర్థము చేసికొనవలసి యున్నది. ఋషులు జగత్సృష్టికర్తయగు విశ్వకర్మ నెన్నినామములతో నెన్నిరూపములతో నభివర్ణించి నను భేదమునకు తావీయక సమైక్యమగు సమన్వయమునే చేయుచు నన్ని నామముల చేతను, అన్ని రూపముల చేతను నొక్కపదార్థమే చెప్పబడుచున్నదని సూచించు చుండిరి. ఇట్టి సమదృష్టిగల మహనీయులు ఎవ్వరినిగూర్చి చెప్పినప్పుడు వారికే సర్వాధిక్యమును బ్రతిపాదించుట మనకు క్రొత్తది కాదు. మన వాఙ్మయములో శివునిగూర్చి వర్ణించుపట్టుల ఆతఁడే సృష్టి స్థితి లయములకుఁ గర్తయనియు, విష్ణునిగూర్చి చెప్పు నవసరమున నాతడే సర్వకర్మాధినాథు డనుటయు, బ్రహ్మను వర్ణించుపట్టున నాతనికే సృష్ట్యాది సర్వకార్య

నిర్వహణ సామర్థ్యమును జెప్పుటయు, అట్లే కాళి మున్నగు దేవతలఁ గూర్చియు వర్ణించుట మన మెఱుంగుదుము. కావున నామ రూపములకంటెను, మూలభూతమగు శక్తి పదార్థమునకే మనవారు ప్రాధాన్యము నిచ్చిరని గమనింప వలసియున్నది. దీనికంతయు మూలము—

"ఏకం సత్ విప్రా బహుధా వదంతి"

"ఉన్నదొక్కటి మాత్రమే. దానిని పండితు లనేక విధములుగా వర్ణించు చున్నారు." అను ఋగ్వేదములోని మంత్రము. జగత్కారణ భూతమగు సచ్చిదానందమును లేదా, సత్యజ్ఞానాంతమగు బ్రహ్మమును పలువిధములుగా నున్న యుపాసకులకు, భక్తులకు నానావిధ నామ రూపములద్వార మున బుద్ధ్యారూఢ మొనర్చుట హైందవ సంప్రదాయము. ఈ సంప్రదాయము ననుసరించియే అఖండ నిర్గుణ బ్రహ్మమును విష్ణురూపమున సగుణముగా వర్ణించి మానవులలో భక్తి జ్ఞాన వైరాగ్యముల నుప్పతిల్ల చేయుటకు భాగవత మవతరించినది.

హరి పరములగు వివిధ రూపముల చేతను, అనంత నామముల చేతను భగవ దనుభూతిని గలిగించి యతీంద్రియ మగు నాత్మజ్ఞానము నొడగూర్చుట భాగవత హృదయము. ఇది మహారహస్యమైన విషయము. ఈ రహస్యము నెఱుంగుట జన్మసంతారకము.

అతి రహస్యమైన హరిజన్మ కథనంబు
మనుజుఁ డెవ్వఁడేని మాపురేపు
చాల భక్తితోడఁ జదువు నా సంసార
దుఃఖరాశి బాసి తొలఁగిపోవు.

కథ నాధారముగాఁ జేసికొని విషయమును బోధించుట యుపాధ్యాయులకు సులభమైనపని. ఉదాహరణము నూతగాఁ గొని విషయము నర్థము చేసికొనుట విద్యార్థులకు సులభతరము. కావున దుర్బోధమగు తత్త్వజ్ఞానమును హరిజన్మ కథాకథనము ద్వారమున పతితల మనముల కెక్కించు టెంత సుకరము! అందును లోకోద్ధరణమునకై యవతరించిన భగవానుని కథల నండగాఁ జేసికొని భగవద్విజ్ఞానమును గలిగించుట యెంత యుచితముగా నుండును!

భాగవతములో వర్ణింపబడినవి హరి చరిత్రము లైనను అందలి విజ్ఞానమంతయును వేదవేదాంతముల లోనిదే. అది వేదవేదాంతములలోని జ్ఞానము కాకున్న మోక్షకారకము కాకపోవచ్చును. ఇది యంతయు వైదికవిజ్ఞానమని భాగవతమే చెప్పుచున్నది గూడను.

వేదకల్పవృక్ష విగళితమయి శుక
ముఖ సుధాద్రవమున మొనసి యున్న
భాగవత పురాణ ఫలరసాస్వాదన
పదవిఁ గనుఁడు రసికభావ విదులు.

లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతా శోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమల వ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై.

భాగవతము వేదార్థప్రతిపాదకమైనను వేదమువలె నిది జటిలముకాదు. కథాప్రధానమైన యీ జ్ఞానము సుగమము. సర్వులకు నుపాస్యము నుపాదేయమును. కావుననే—

నిగమములు వేయి చదివిన
సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను
నిగమంబు పఠింప ముక్తి నివసనము బుధా!

అనుచున్నాడు. మఱియును వేదపఠనము, వైదిక కర్మాచరణమును స్వర్గ ప్రాప్తికి హేతుభూతములై మానవునకు బునర్జన్మము నొదవింప వచ్చును. కాని వేదాంతవిజ్ఞాన బంధురమగు భాగవత నిగమమో, పునరావృత్తి రహితమగు శాశ్వత మోక్షము నొసఁగఁ జాలుచున్నది. ఎన్ని జన్మములనో గాని సాధింపబడని మోక్ష పురుషార్థమును భాగవతము సులభమార్గమునఁ గైవసము చేయును. ఇంతకన్న మానవునకు గావలసిన దేమి? మఱియు మోక్షకారకములయిన కర్మ జ్ఞానములను భక్తియుక్తము లగునట్లుచేసి, భక్తి జ్ఞాన కర్మ యోగములను సమ్మిళితము చేయుటయు భాగవతావతరణము

నకు మూలమై యున్నది. ఈ యంశములు నారదమహర్షి వ్యాసున కిట్లు బోధించుచున్నాఁడు—

"నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న శోభితంబు గాదు. ఫలంబు గోరక కర్మం బీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తంబై యుండదు. భక్తి హీనంబులయిన జ్ఞాన వాచా కర్మ కౌశలంబులు నిరర్థకంబులు గావున...నిఖిలబంధ మోచనంబు కొఱకు వాసుదేవుని లీలా విశేషంబులు భక్తితోడ నభివర్ణింపుము."

పై వాక్యములవలన భాగవతము భక్తియోగమహిమను వెల్లడించి యద్దానికి గూడ నీశ్వరసాక్షాత్కార సాధనత్వమును నిరూపించుటకు బుట్టినట్లు తెలియు చున్నది. ఈ యంశము భాగవతములో వర్ణితములగు పెక్కు కథల మూలముననను దెల్లమగును. భాగవతములో భక్తి యోగ మిట్లు పట్టాభిషిక్త మయినను, జ్ఞాన మహనీయతయు, జగదాత్మలయం దీశ్వర భావాభ్యాసమును అనునవి విస్మృతములు కాలేదు. వానికిని బరమప్రాధాన్యము స్పష్టమగు చున్నది. ఏకాదశస్కంధమున గృష్ణు డుద్ధవున కుపదేశించు దిగువ వాక్యములవలన పై అభిప్రాయము తేటపడుచున్నది—

"పురుషుండు నానార్థకామంబుల నంగీకరించి నిజగుణదోషంబుల మోహితుండై యుండుంగావున, హస్తిపకుండు గంధనాగంబుల బంధించు చాడ్పున నింద్రియంబులను మనో

వికారములను నిగ్రహించి ఈషణాత్రయంబును వర్జించి మోదఖేదంబుల సముండవుగా వర్తించుచు నీ జగంబంతయు నాత్మాధిష్ఠితంబుగాఁ నెరింగి మాయాదులాత్మ తత్త్వాధీనంబులుగా దెలియుచు జ్ఞాన విజ్ఞాన యుక్తుండవై యాత్మానుభవ సంతుష్టుండవై విశ్వంబును సమ్యగా భావించి వర్తింపవలయు."

పురుషార్థములు నాల్గింటిలో నర్థకామములు రెండును జీవన నిర్వాహణమునకు సాధనములు. అర్థము లేకున్న నే కార్యమును సాధింపబడదు కావునను, కడకు దేహధారణమునకుఁగూడ నన్నాదు లర్థముచేతనే సాధింపబడవలసి యున్నందునను, బురుషుడు మొట్టమొదట న్యాయముగా నర్థార్జనము సేయవలయును. అట్లే కామేచ్ఛ దీర్చుకొనుటయు జీవసాధారణమైన ధర్మమును సృష్టిప్రవర్తకమైన కర్మమునై యున్నది. మానవుడు జీవితనిర్వాహణమున కవసరమైనంతవఱకే యీ రెండుపురుషార్థములలో బ్రవర్తింపవలయునుగాని మితిమీఱి వానిని సేవింపరాదు. అట్లొనర్చినచో జీవున కుద్గతిని జేకూర్చు ధర్మమును, భగదనుభూతిని గలిగింపవలసిన మోక్షమును డిందుపడి పోవును. కావుననే చతుర్వర్గములలో ముందు ధర్మము పేర్కొనబడినది. తక్కిన మూడు పురుషార్థములును ధర్మము తప్పక సాధింప బడవలయుననుట భారతీయ హృదయము. కావున ధర్మముతప్పిన యర్థకామములు మానవు

నధఃపతితుని జేయును. ఈ సంగతి నెఱింగి యింద్రియములకు లోబడక, మనోనిగ్రహశాలియై ద్వంద్వములందు సమదృష్టి గలిగి యాత్మారాముడై జగము నీశ్వరస్వరూపముగా నారాధించుట మానవునికిఁ గర్తవ్యమని భగవాను డుద్ధవున కుపదేశించిన వాక్యములచే తెలియుచున్నది.

సాధకుల యధికారమునుబట్టి విగ్రహారాధనము, సాంఖ్యము, యోగము మున్నగు దార్శనికవిషయములును భాగవతములో బోధింపబడక పోలేదు. మఱియు నొక్కచో ద్వైతమును, మఱొక్కచో నద్వైతమునుగూడ జెప్పబడినట్లు మనము గ్రహింపగలము. ఒక్కమాటలోఁ జెప్పవలయునన్న నిష్కలము, నిర్గుణము, నిరంజనము, సచ్చిదానందము నగు పరబ్రహ్మము శ్రీకృష్ణాది నానావతారములలో సగుణముగా విహరించి భక్తుల యభీష్టములను దీర్చి సాధకుల కనేకమార్గముల నుపదేశించె నన్నఁ జాలును.

వేదాంతవిషయము నటుంచి చూచిన భాగవతము విష్ణుకథాప్రధానమైన ప్రబంధమని మొదటనే చెప్పుకొంటిమి. ఆ కారణముచే విష్ణుదేవుని మత్స్యాద్యవతారలీలలు ఇందు స్పష్టముగా వర్ణితములైనవి. ఇందలి వామనావతారఘట్టము, ప్రహ్లాదచరిత్రము, మున్నగు దశావతార చరిత్రములే కాక గజేంద్రమోక్షము, ధ్రువచరిత్రము, భరతునికథ మున్నగు ననేకోపాఖ్యానములు ఆధ్యాత్మికసాధకులగువారి సాధక

బాధకములను వర్ణించుచు ముముక్షువుల కనేక సదుపదేశ ముల నొనర్చుచు వారి యాచరణమునకు తోడు సూపు చున్నవి. ఇంకను శ్రీహరియొక్క కపిలాద్యవతారములను ఆ యా యవతారములం దాతడు చేసిన జ్ఞాన విజ్ఞాన ప్రచార ములను దెలిపెడిని. ఇట్లు భాగవతము విష్ణుకథా ప్రచుర మైనను అవసరమైన ఘట్టముల నట నట శివలీలలనుగూడ వర్ణించుచునే యున్నది. క్షీరసాగర మథనసందర్భమున నుద యించిన విషమును భక్షించి శివుడు నీలకంఠు డగుట మున్నగు కథ లిందుకు దృష్టాంతములు.

భాగవతములో విష్ణుదేవుని వివిధావతారములను వర్ణించు టొకయెత్తు, శ్రీకృష్ణావతారకథను వర్ణించుటొక యెత్తు. కృష్ణావతార కథ ఒక దశమస్కంధములో మాత్రమే యున్నను గ్రంథబాహుళ్యమును బట్టిచూచిన దరిదాపు సగము గ్రంథ మీ కృష్ణచరిత్రమునకే కవి వదలినాడు. అనగా భాగవతమును రెండు భాగములుగా విభజించినచో నొక్క దశమస్కంధము తక్కిన పదునొకండు స్కంధము లతో తులతూగ గలదు. ఏకాదశ ద్వాదశ స్కంధములు మిక్కిలి చిన్నవి.

గ్రంథకర్తయగు కృష్ణద్వైపాయనుడు శ్రీకృష్ణదేవు నికి సమకాలీనుఁ డగుటవలన ఆ మహాత్ముని చరిత్రోదంతము లను ఉన్న వున్నట్లుగా సవిస్తరముగను సమగ్రముగను

వర్ణించి యుండవచ్చును. శ్రీకృష్ణజననము, బాల్యలీలలు, కంసవధము, రుక్మిణీకల్యాణము, కుచేలచరితము, నరకాసుర వధము మొదలగు ననేకవిషయము లీ దశమస్కంధమున మనోహరముగా వర్ణింపబడినవి. భాగవతకర్త దివ్యనాయకు డగు శ్రీకృష్ణుని దనకావ్యమున నాయకరత్నముగా నొనర్చు కొని బహుభంగులుగా నాతని దివ్యావతార లీలలు నువ వర్ణించి తాను ధన్యుడగుటయేకాక, శ్రోతలను బఠితలనుగూడ ధన్యుల నొనర్చినాడు. కావుననే యేడు దినములలో మర ణింపనున్న పరీక్షిన్నరేంద్రున కీ భాగవతమును శుకయోగీం ద్రుడు వినిపించి యాతనికి మోక్షమును కరతలామలక మొనర్చినాడు !

భాగవతములో శ్రీకృష్ణచరిత్ర మింత ప్రాధాన్యము నందుటకు కృష్ణపరమాత్మ గీతోపదేష్ట యగుటగూడ నొక కారణమే యగును. రామచంద్రు డుత్తమ నాయకుడైనను ఆతనిలో దివ్యత్వాదివ్యత్వములు, జ్ఞానాజ్ఞానములు రెండును నున్నయవి. ఆతడు వశిష్ఠునిచే నుపదేశము నంది యొకరికి శిష్యభూతుడయినాడే కాని తానై యుపదేశక పదవి నంద లేదు. మఱియు సీతావియోగాది ఘట్టములందు రాముడు ప్రాకృతజనునట్లు విలపించి తనలోని యజ్ఞానమును ప్రకటిం చును. శ్రీకృష్ణునిజీవితములో నట్టి దెచ్చటను లేదు. ఆతడు ఆ యా కార్యములందు సర్వజ్ఞుడై ప్రవర్తించినట్లు గన్ప

ట్టును. శోకమోహాములుగాని, నిందాస్తుతులుగాని, మానావ మానములుగాని వాని నెచ్చటను కలగుండు వెట్టలేదు. ఆతడు ద్వంద్వాతీతుడై సిద్ధావస్థను బొందిన మహాయోగివలె జీవిత రంగమున నటించును. ఇట్లు దివ్యత్వమును బ్రకటించుటయే కాక, భగవద్గీతవంటి మహాజ్ఞాన భాండారము నాతడు అర్జు నుని నిమిత్తమాత్రునిగా జేసికొని లోకమున కందించినాడు. సర్వోపనిషత్తుల సారమగు నీ విజ్ఞానము నుపదేశించుటలో కృష్ణచంద్రుని గురుత్వమును సర్వాతిశాయియై ప్రకాశించి నది. భగవద్గీతలోఁ జెప్పబడిన ఆధ్యాత్మిక సూత్రములు శ్రీ కృష్ణజీవితములో సమన్వయము పొందుచున్నవి. గీతల యందలి స్థితప్రజ్ఞ లక్షణములు, గుణాతీతస్థితులు, సిద్ధావస్థను బ్రాపించిన యోగీశ్వరుని లక్షణములు, కర్మ జ్ఞాన విధాన ములు కృష్ణునిలో దర్శింపగలము. కృష్ణచరిత్ర మింత మహి మాఢ్య మయినందువలననే భాగవతములో నంతటి స్థాన మును బొందినది. ఆధ్యాత్మిక గ్రంథములలో భగవద్గీతకు బిమ్మట చెప్పదగినది భాగవతమను ప్రసిద్ధి నైతము గలుగు టకు అది కృష్ణతత్త్వ ప్రతిపాదక మగుటయే యని చెప్ప వచ్చును. గీత దార్శనిక మార్గమును ద్రొక్కిన సూత్రగ్రంథ మగుచో భాగవతము దానికి వ్యాఖ్యానప్రాయమగు లక్ష్య గ్రంథ మనవచ్చును.

భాగవతములోని శ్రీకృష్ణుని కథాభాగమును భాగవత మనుపేర వీధినాటకముగా మొన్న మొన్నటివఱకును నాటు భాగవతులు ప్రదర్శించుట మన మెఱుఁగుదుము. దీనినిబట్టి చూచినను భాగవతమన్న ప్రధానముగా శ్రీకృష్ణచరిత్రమే యనుట స్పష్టమగుచున్నది. ఏది యెట్లయినను భాగవతములో మాత్రము శ్రీకృష్ణ చరిత్రమున కత్యంతప్రాధాన్యము గలదందును. ఇందుకు మఱొక్క దృష్టాంతమును వచించి విరమింతును.

పదునాఱు వేల గోపికాస్త్రీలును పూర్వజన్మమున ఋషులును దేవతలు నని భాగవతమే చెప్పుచున్నది. వారీ జన్మమున గోపికలై పుట్టి కృష్ణోపాసనచే తరించిరి. భక్తుడగు వాడు తన్ను ప్రేయసిగా భావించుకొని జగన్నాథుని నాథునిగా భావించి యుపాసించి మోక్షము నందుట యొకవిధమగు భక్తి. ఈ భక్తి వంగదేశములో చైతన్యాది భక్తుల యందును వ్యాపించినది. ఈశ్వరుఁడు కామక్రోధాదులచేతను గమ్యు డనుటకు భాగవతమే దిగువ సాక్ష్యమును బలుకుచున్నది:—

కామోత్కంఠత గోపికల్, భయమునం గంసుండు, వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్య నృపతుల్, సంబంధులై వృష్ణులుం,
బ్రేమన్ మీరలు, భక్తి నేము, నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామ ధ్యానగరిష్ఠుడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!

పరీక్షిత్తునకు గలిగిన సందేహమును పై సమాధానము చేత శుకయోగీంద్రుడు దీర్చినాడు. కామము, క్రోధము, భయము, సంబంధము, ప్రేమము, భక్తి అనువానిలో దేనిచే నైనను శ్రీహరిని జేరవచ్చునట. వీని యన్నింటను నుద్దామ మగు భగవద్విషయిక ధ్యాన ముండును గావున తత్ప్రాప్తి సులభమని శుకయోగి వ్యాకుచ్చినాడు. కావున గోపికల కామము తుచ్ఛముకాదు, అది దేహాతీతము, మఱి దివ్యమును.

షోడశ సహస్రగోపికల నటుంచినచో శ్రీకృష్ణు డష్ట మహిషీ మనోహరుడు. ఆ యెనమండ్రురిలోను రుక్మిణి యాతని కత్యంతము గూర్చు సతి. ఈమె యాది లక్ష్మియు నందురు. రామాయణములో నేడు కాండములకును నంత రార్థ మున్నట్లే, యష్టభార్యాసమేతుడగు కృష్ణుని విషయము నను ఉపాసకులు భావింపదగిన పరమార్థ మగపడుచున్నది.

అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచభూత ములు ననునవి జగత్సృష్టికి హేతువులైన పదార్థములు. పరమేశ్వరు డీ యష్టప్రకృతులచేతి జగత్తులను సృష్టిచేయు చున్నాడు. అనగా నీ యష్టప్రకృతుల కాత డధినాథుడై ప్రపంచ ఘటన సేయుచున్నాడనుట. ఈ యంశమును అష్ట భార్యాయుక్తుడగు కృష్ణుడును సూచించు చున్నాడు. లేకున్న మహారాజగు నాత డింక నల్వురు భార్యలను పెండ్లాడ లేడా? అష్టభార్యలనే యేల పెండ్లాడెను?

మఱియు శ్రీ విద్యాతంత్రమును, మంత్రశాస్త్రమును బట్టి చూచినచో శిరస్సునందు సహస్రారచక్రము గలదు. సహస్రారమందు ప్రధానమైన వెనిమిది దళములు మాత్రము. ఆ కారణమున దాని నష్టదళపద్మమనియు నందురు. ఈ యష్టదళములును మహత్తు మొదలగు నష్టప్రకృతులకు సూచకములు. కావుననే బ్రహ్మ, లక్ష్మి, గాయత్రి మున్నగు దేవతల కాసనముల నమర్చునపుడుగూడ అష్టదళ పద్మములనే నిర్మింతురు. సహస్రారమందు సాధకులకు పరమాత్మ సాక్షాత్కార మగుననుట వేదాంతశాస్త్ర ప్రసిద్ధము. ఆ యష్టదళ పద్మములో విహరించు సచ్చిదానంద స్వరూపుడు కృష్ణనామక పరబ్రహ్మమే. ఆ పరబ్రహ్మజగల్లీల యీ యష్ట ప్రకృతులతో, ఈ మహారహస్యమునే యష్టమహిషీ సమేతుడగు శ్రీకృష్ణ చంద్రుడు సూచించుచున్నాడు. గంభీరమును భావబంధురమును నగు భారతీయ వేదాంతములో నిట్టి రహస్యము లెన్నియో గలవు. శ్రీకృష్ణవిషయికముగా నున్న యిట్టి రహస్యముల నీ చిన్నిపొత్తమున వివరింప గాదు. మఱియు భాగవత ప్రాశస్త్యము గొంచెముగా ప్రకటింప నుద్దేశించిన దీనిలోఁ గృష్ణావతార తత్త్వమునుగూడ కొలదియేని నిరూపించు టసాధ్యము. కావున ఆ విషయముల నటుంచి ఆంధ్ర భాగవత కవిత్వమును, తత్కవినిగూర్చి కొంత దెలిసికొందము.

## మూడు కావ్యాలు

### పోతన భాగవతము

భక్తిసురభిళ కుసుమ దామము
ముక్తిఁ జూటుకుఁ బోతనార్యుం
డాంధ్ర భారతి రమ్యకంధర
నంకితము చేసెన్.

—నా "తోరణము"

భాగవతాంధ్రీకరణము బమ్మెర పోతనవంటి మహా భక్తిమూర్తి చేతిలో బడుట తెనుగుబాస చేసికొన్న పూజ. భక్తిమాహాత్మ్య ప్రతిపాదకమగు నీ గ్రంథమును మహాభక్త శిఖామణియగు పోతన్న తెలిగించి తన జన్మమును మాత్రమే ధన్యము చేసికొనలేదు. తెలుగుభాష జన్మమును, తెనుగు వారి జన్మములనుగూడ ధన్యము లొనర్చినాడందును.

పోతన జన్మించునాటికి భారతము పూర్తిగా నాంధ్రీకృతమయినది. భారతకవుల ప్రతిష్ఠయుఁ దెలుగునాట మేటిగా నెలకొన్నది. రామాయణము సైతము భాస్కరాదులచేఁ దెనిగింపబడియే యుండెను. అవియేగాక, మఱికొన్ని పురాణాదులు నాంధ్రీకృతములైనట్లు పోతన చెప్పుచున్నాడు. ఈ యాంధ్రీకృతులలో పోతనకు నచ్చినది కవిత్రయమువారి యాంధ్రీకరణపద్ధతియు వారి కవిత్వమునే. భాస్కరాదుల రచన మాతని కింపు గూర్చినట్లులేదు. కనుకనే పూర్వాంధ్ర కవిస్తుతి సేయుపట్టుల నన్నయతిక్కనలనే యాతడు నామనిర్దేశ

పూర్వకముగా గైవారము చేసినాడు. భాస్కరుని ప్రస్తావన చేయలేదు. భాస్కరాదులను "మఱియు నితర పూర్వ కవిజన సంభావనంబు గావించి" అను వాక్యములో నిమిడ్చినాడు. ఎవరెన్ని యాంధ్రీకరణములు వెలయించినను వారు భాగవతము జోలికి బోక తనకోస మద్దానిని మిగుల్చుట తన పూర్వజన్మ సుకృతవిశేష మనుచున్నాడు పోతన.

ఒనరఁగ నన్నయ తిక్కనాదికవులీ
యుర్విం బురాణావళుల్
దెనుగుం జేయుచు మత్పురాకృత శుభా
ధిక్యంబు దా నెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతముం
దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు చేసెదఁ బున
ర్జన్మంబు లేకుండఁగన్.

తాను భాగవతమును రచించుటలోని యుద్దేశ్యము తనకుఁ బునర్జన్మము లేకుండఁ జేసికొనుట. ఈ ప్రయోజన మొండొక గ్రంథము నాంధ్రీకరించుటచేత నొనగూడదు. పోతరాజు తన సంస్కారముల కనువయిన కార్యమునే నిర్ణయించుకొనినాడు. ప్రాపంచిక భోగములుగాని, ఐహికాడంబరములుగాని ఆతని లక్ష్యములు కావు. అయినచో తక్కిన కవులవలె రాజులనో, రంగప్పలనో యాశ్రయించి వాని సిద్ధిని బొందెడు వాడేకదా! వైరాగ్యకలితుడై త్యాగమయ

జీవితమును గడుపనెంచినాడు కావుననే శ్రీ రామచంద్రునికి దప్ప ఒరునకు దన కృతి నీయ నంగీకరింపలేదు

ఇమ్మనుజేశ్వరాధముల
కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని
చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వాటులం బడక
సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరాజొకడు
భాగవతంబు జగద్ధితంబుగన్.

అని చెప్పుకొనుట పోతనవంటి యైహికభోగ పరాఙ్ముఖునకే చెల్లినది. అగుగాక. భారత రామాయణములలోని భాషవలె భాగవతములోని సంస్కృతభాష యంత సులభమైనది కాదు. విషయము గూడ వేదాంతబంధుర మగుటచేత శాస్త్రజటిలమై యుండును.

ఇట్టిదాని యాంధ్రీకృతి యెంత కష్టతరమో చూచితిరా ? కావుననే—

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధజనుల వలన విన్నంత గన్నంత
దెలియవచ్చినంత దేటపఱతు.

నని, సవినయముగా దాను పెద్దలచే నెఱింగిన మట్టుకు మనవి యొనర్చెద ననుచున్నాడు. పోతన సహజపాండి

త్యాడు. చదువుసంధ్య లాతనికి భగవత్కృపచేఁ గలిగినవే కాని, యుద్దండులగు గురువులను శుశ్రూషించి పొందినట్టివి కావు. అయిన నేమి ? రామభద్ర కృపావిశేషమునఁ దనకు కృతకృత్యత మాత్రము దూరము కాదని యాతని విశ్వాసము. కావుననే—

పలికెడిది భాగవతమట,
పలికించెడువాఁడు రామభద్రుండఁట; నేఁ
బలికిన భవహర మగునట,
పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా !

అనుచున్నాడు. దీనింబట్టి పోతరాజెంతటి భగవత్పరాధీనుడో, ఆత్మవిశ్వాసము కలవాడో వ్యక్తమగు చున్నది. పోతరాజు ఆత్మశ్లాఘ యటుంచినను, స్వవిషయమున నున్న దయిన నున్నట్లు చెప్పుకొనుటకుగూడ నొడంబడని యవికత్థనుఁ డనవలయును. ఆతడు నన్నయగారివలె "తన కుల బ్రాహ్మణు" నిత్యాదిగా ప్రశంస చేసికొనలేదు. శ్రీనాథుని వలె తన గొప్పదనమును కృత్యారంభమున గానము చేసికొనలేదు. తన్నుగూర్చి "సాధునయ యుక్తుండక" అని మాత్రము చెప్పుకొన్నాడు. పోతనకాలమున వెలువడిన యాంధ్ర గ్రంథములలో నన్నయ తిక్కనల భారతము మాత్రము పోతనకు నచ్చిన ట్లగపడు చున్నది. తత్ప్రశంసనే ఆతడు "ఒనర నన్నయ తిక్కనాది కవులు..." అను పద్యములో చేసియున్నాడు. ఆ యిరువురి కవులలో ఒకరిది

సంస్కృత ప్రచురమైన మార్గము. మఱొకరిది తెలుఁగుదనము నిండారి తొణికిసలాడు త్రోవ. ఈ రెండురీతులను ఎట్టిన కొంతవఱకు సరిపాళ్ళలోఁ బోదివి యొక క్రొత్తఁ దనమును దెనుగు పలుకుచెలికి గూర్చినాడు. ఈ ముత్రోవలను వేలు వేలుగా మెచ్చుకొను పాఠకులు పోతనకాలమున నున్నారు. అట్టివారి నందఱిని మెప్పించుట పోతనార్యున కవసరమైనది. కాబట్టి: —

కొందఱకుఁ దెనుగు గుణమగు
కొందఱకును సంస్కృతంబు గుణమగు రెండుం
గొందఱకు గుణములగు, నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యై యెడలన్.

అని ఆ కాలపు టభిరుచుల ననుసరించి యాతడు నిరాడంబరముగా ప్రతిజ్ఞ చేసినాడు. ఇది పోతన సగర్వముగా చేసిన ప్రతిన కాదు. ఆత డిట్టిపని చేయుటకు సమర్థు డయినందున తన రచించు కృతివిధానమునుగూర్చి పాఠకులకు పరిచయము మాత్రము చేసినాడు. అట్లు కాదేని తన శక్తిసామర్థ్యము లను గూర్చియు, కవితాగుణములను గూర్చియు నింక నితర యోగ్యతలను గూర్చియు చెప్పవలసినది చాల యున్నది. అట్టివెల్ల తక్కుంగల కవులవలె నీతడు చాటుకొనడు. ఇట్టి గుణశీలములచేత పోతన భాగవతమువంటి భక్తిప్రధానమగు నాధ్యాత్మిక గ్రంథమును దెనుగుసేయుట కెంతయు దగి పోయినాడు.

మహాభక్తుడగు నీతడు భక్తిరసఘట్టములను వర్ణించు పట్టున దన్మయుడై పోవును. ఒక్కొకసారి మూలముననున్న యర్థమును విస్తరించుచును, వివరించుచునుగూడ గ్రంథమును బెంచును. ఆ కారణమున సంస్కృత భాగవతము నందలి యర్థకాఠిన్యము తెలుగు భాగవతమునఁ జూపట్టదు. దాని కిది వ్యాఖ్యాన ప్రాయముగా నుండును. ఆంధ్రీకరణ పద్ధతిలో పోతరాజీ మార్గముల ననుసరించుటచేత సంస్కృత భాగవతమునకన్నఁ దెనుగుభాగవతము గ్రంథసంఖ్యలో బెంపు చెందినది.

పోతరాజుకవిత్వము ద్రాక్షాపాక శోభిత మైనది. నన్నయ్యను గొండాడి యాతని కవితారీతులయం దాదరము చూపిన యీతడు దీర్ఘతర సంస్కృతసమాసములను వాడినను అవి లలితములై యుండునేకాని జటిలములై దుర్గ్రహములై యుండవు. మఱియు రసనిబంధనైకదృక్కగు నీతడు సమాసనిర్మాణము చేసినను రసభంగమునుగాని, నీరసత్వమునుగాని ప్రవర్తిల్లనీయడు. దిగువపద్యము నారయుడు—

వరగోవింద కథాసుధారస మహా
వర్షోరుధారా పరం
పరలం గాక బుధేంద్రచంద్ర యితరో
పాయానురక్తిం బ్రవి

స్తర దుర్దాంత దురంత దుస్సహ జను
స్సంభావితానేక దు
స్తర గంభీర కఠోర కల్మష కన
ద్దావానలం బాఱు నే!

పైపద్యము దీర్ఘసమాస శోభితమయ్యును భావ స్ఫూర్తిలో మనకు బాధాకరముగా లేదు. అట్లే తిక్కనసోమ యాజిపై గౌరవముగల యిమ్మహాకవి తెలుగుపలుకుల కూర్పునేర్పును వెలయించినను అది ముద్దులు మూటగట్టు చుండును. చదువువారు వినువారు తెలుగు తేనియలను గుత్తుక బంటిగా త్రావుదురు.

అడిగెద నని కడు వడిఁ జను,
నడిగినఁ దను మగుడ నుడువఁడని నడ యుడుగున్;
వెడ వెడ సిడిముడిఁ దడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుఁగిడు నెడలన్.

పై పద్యము శబ్దాలంకార భూయిష్ఠమై కేవల ప్రాస్వ ముల కూర్పుతో నొక సొగసుదనమును బచరించుచున్నది. శబ్దాలంకారముపై పోతనకు మక్కువ యెక్కువ. అంత్యాను ప్రాసము నీతఁ డెక్కువగా ప్రేమించు చుండును. వామనుడు బలి నాశీర్వదించు నవసరమున—

స్వస్తి జగత్త్రయీభువన
శాసనకర్తకు హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు ను
దారపద వ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వరి వి
ధాన విహర్తకు నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరి
హర్తకు దానవలోక భర్తకున్.

అని యెంత సుందరముగా చెప్పెనో చూడుడు. ఇట్లు శబ్దాలంకార శోభితమగు రచన మొనర్చుటయందేగాక తెలుగు వారి పలుకుబళ్ళ పోలికల ననుసరించియు తేటతేటగా, ముద్దు ముద్దుగా పండిత పామరుల మనసు లుప్పొంగున ట్లీతఁ డర్థ ప్రకటనము చేయగలడు.

మన యశోద చిన్ని మగవానిఁ గనె నట
చూచివత్తమమ్మ సుదతులార !

సంతానహీన యగు నొక జవరాలు ప్రసవించినపు డిరుగు పొరుగు చేడియల కుండు వేడుక పైమాటలలో దేట పఱిచినాడు కవి. సంస్కృతాంధ్రములను సమభాగములుగా వాడి యలతి యలంతి మాటలతోడను పోతన్న కవితా రచన ముచేసి "రెండుం గొండఱకు గుణములగు" నని తన చేసిన ప్రతిజ్ఞ నెఱవేర్చుకొన్నాడు. గజేంద్ర రక్షాపరాయణుడగుహరి

"అల వైకుంఠపురంబులో నగరిలో
  నా మూల సౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః
  ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోదియగు నా
  పన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహి పాహి యను కు
  య్యాలించి సంరంభియై."
"సిరికిం జెప్పడు శంఖ చక్ర యుగముం
  జేదోయి సంధింపఁడే
పరివారంబును జీర డభ్రగపతిం
  బన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లము చక్కనొత్తడు వివా
  ద ప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడడు గజ
  ప్రాణావనోత్సాహియై."

పై పద్యములెంత మనోహరములు! ఎంత యర్థగంభీరములు! భాగవతములోని వామనావతారఘట్టము, గజేంద్రమోక్షకథ, ప్రహ్లాదచరిత్రము, శ్రీకృష్ణలీలలు, రుక్మిణీకల్యాణము, నరకవధ మున్నగు కథాభాగము లెంతయు మనోహరములు. తెలుగునాట ఆబాలగోపాల మీ కథలను జదివించుకొని విని సంతసించు చుందురు. ఆయా కథలను వర్ణించు

నప్పుడును, సంవిధానములను గల్పించునప్పుడును పోతన మహాకవి తెనుఁగువారి యాచార వ్యవహారములను, మర్యాదలను బాటించి తీర్చిదిద్దుచు నొక ప్రజాకవియై ప్రకాశించును. సామాన్య కుటుంబీకుఁడగు హాలికుఁడు గదా మఱి పోతన. రాజాధిరాజులమీఁది కంటెను దీనులును, భిక్షుకులును, సాధువులును నగువారి మీఁదనే యాతని కాదరము మెండు. జరాసంధుడు కృష్ణునితోఁ బోరు సల్పు నవసరమున నాఁడు నెత్తిపొడుపు మాటలు సుందరములై తెలుఁగువారి కలహారీతులకుఁ దార్కాణములుగా నున్నవి—

అదలించి తోపంగ నాలమందలు గావు
గంధగజేంద్ర సంఘములు గాని
పరికించి వినగ నంభారవంబులు గావు
వాజీంద్ర హేషారవములు గాని
పదహతిఁ గూల్పంగఁ బాఁతబండ్లివి గావు
నగసమాన స్యందనములు గాని
ప్రియములాడంగ నాభీరలోకము గాదు
కాలాభ వైరివర్గంబు గాని
అల్ప వనవహ్ని గాదు బాణాగ్ని గాని
మురియ బృందావనము గాదు మొనలు గాని
యమున గాదు నటింప ఘోరాజి గాని
పోరు నీకేల గోపాల పొమ్ము పొమ్ము.

గోపికావల్లకీ ఘోషణంబులు గావు
శింజినీ రవములు చెవుడు పఱచు
వల్లవీ కరముక్త వారిధారలు గావు
శరవృష్టి ధారలు చక్కసేయు
ఘోషాంగనాపాంగ కుటిలాహతులు గావు
నిశితాసి నిహతులు నిగ్రహించు
ఆభీర కామినీ హస్తాబ్జములు గావు
ముష్టి ఘాతంబులు మురువుడించు
అల్ల వ్రేపల్లె గాదు ఘోరావనీశ
మకర సంఘాత సంపూర్ణ మగధరాజ
వాహినీసాగరం బిది వనజనేత్ర
నెరసి నిను దీవి కైవడి నేఁడు ముంచు.

గోపాలుడును గోపికాలోలుడును నగు శ్రీకృష్ణుని నిర్వీర్యునిగా భావించి క్షాత్ర తేజో విరాజితుడ ననియు, బలశాలి ననియు గర్వించు జరాసంధు డిట్టిమాట లాడుట యెంతయేని సమంజసము.

పోతన తెలుగు పడంతుల స్వాభిమాన గంధమును, వీర రసారాధనా తాత్పర్యమును సత్యభామతోఁ జిత్రించినాడు. నరకుని వధింప నుద్యుక్తురాలైన సత్య రూపుదాల్చిన వీర రసము.

వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీ
వీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీ
చీజాలముల్ పర్వఁగాఁ

బాణింబరయ్యెద చక్కఁగా దుఱిమి శం
ఖధ్వీర సంరంభయై
యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రా
కేతాగ్ర భాగంబునన్.
అలి నీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్ర
త్యాలీఢ పాదంబుతో
నలికస్వేద వికీర్ణ కాలకలతో
నాకర్ణికానీత స
ల్లలిత జ్యా నఖపుంఖ దీధితులతో
లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్త విశిఖ
వ్రాతాహతా రాతియై.

సత్య యిట్లు రూపుకట్టిన వీర రసమైనను అది నరకు నకే. పతిని దిలకించునపుడా ఘట్టములోనే యామె శృంగార రాజ్య రమాధిదేవత, వలపులు తొలకరింపఁజేయు మన్మథ సామ్రాజ్యలక్ష్మి.

పతిఁ జూచున్ బరుఁ జూచు నొంప నలరిం
పన్ రోషరాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో
వీరంబు శృంగారమున్
జరగన్ గన్నుల గెంపుసొంపు బరఁగన్
జంద్రాస్త్ర సందోహమున్
సరసాలోక సమూహము న్నెఱపుచున్
జంద్రాస్య హేలాగతిన్.

ఇట్లు వీరశృంగార భావము లోక పాత్రలో నొక్క సమయముననే వర్ణించి చూపి పోతన తెలుగు నారీమణుల వీరశృంగార విలాసములకు మెఱుగులు దిద్దినాడు. కరుణ రసమునందును బోతనకుఁగల చాకచక్యము మెచ్చఁదగినది.

> ఎక్కలు రావు పిల్లలకు
> రేపటినుండియు మేఁత గానమిఁ
> బొక్కు చు గూటిలోఁ నెగసి
> పోవఁగఁ జాలవు మున్ను తల్లి యీ
> దిక్కున నుండి వచ్చునని
> త్రిప్పని చూడ్కుల నిక్కి నిక్కి నల్
> దిక్కులుం జూచుచున్న వతి
> దీనత నెట్లు భరింతు నక్కటా!

ఇందు స్వభావసిద్ధమగు వర్ణనముఁగూడ సొంపు గుల్కినది. కరుణ మతివేలముగా ప్రవహించినది.

పోతన కవీంద్రుని భక్తిమాధుర్యము వెలలేనిది. ప్రహ్లాద చరిత్రములో "పానీయంబులు ద్రావుచుఁ గుడుచుచుఁ భాషింపుచుఁ హాసలీలానిద్రాదులు సేయుచు – సంతత శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానుఁడై" విశ్వమును మఱచినది ప్రహ్లాదుఁడే కాదు, భాగవతము వంటి భక్తిగ్రంథమును వ్రాయుచుఁ బోతన గూడను. ప్రహ్లాద చరితమందలి పెక్కు పద్యము లాంధ్రుల రసనాగ్రము

లందు నాట్యము సేయునట్టివే. పోతరాజు మందార మకరంద మాధుర్యధుర్య మగు నీ పద్యమును జదివి యానందింపని యాంధ్రు డుండఁడు.

మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం
బరుగునే సాంద్ర నీహారములకు
అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేష మత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు
వినుతగుణశీల మాటలు వేయునేల ?

భక్తులు సాధకులు నగువారి వివిధావస్థలు, అనుభవములు భాగవతములోఁ జక్కగా సూచితము లైనవి. గజేంద్రుని మొఱలో భక్తమానసము పొందు వివిధ దశలు వర్ణితములు. అట్లే ధ్రువునివిషయమున దృఢమగు కార్యనిశ్చయము కష్టసహిష్ణుత సాధకులకు దేటపడుచున్నవి. కుంతి, భీష్ముడు, అక్రూరుడు మున్నగువారి స్తుతులును, ఉద్ధవుని సంప్రశ్నము

లును. ఆ రూపములో నుండుటకు గారణము మూల భాగవత మొక్కటే కాదు. పోతన ఆధ్యాత్మిక సాధకుడు భక్తుడు నగుటచేత గూడ ఆతని హృదయావస్థలు అనుభూతులు పెక్కు పాత్రములందు గాన నగును. కవి తన స్వరూపమును, అనుభవములను తన పాత్రల ద్వారమున లోకమునకు వ్యక్తము చేయుచుండుననుట కవిజన ప్రసిద్ధము. ప్రహ్లాద కుమారుని భక్తిని వర్ణించు సందర్భమున భక్తుడుపొందు వివిధ మనోవస్థలు చక్కగా వర్ణింప బడినవి.

> వైకుంఠ-చింతా వివర్జిత చేష్టుడై
> యొక్కడు నేడుచు నొక్కచోట
> అశ్రాంత హరిభావ నారూఢ చిత్తుడై
> యుద్ధతుడై పాడు నొక్కచోట
> విష్ణుం డింతియ కాని వేఱొండు లేదని
> యెత్తిలి నగుచుండు నొక్కచోట
> నలినాక్షుడను నిధానము గంటి నేనని
> యుబ్బి గంతులు వైచు నొక్కచోట
> బలుకు నొక్కచోటc బరమేశుc గేశవుc
> బ్రణయ హర్ష జనిత బాష్పసలిల
> మిళిత పులకుండై నిమీలిత నేత్రుడై
> యొక్కచోట నిలిచి యూరకుండు.

భాగవతములోని కెల్ల రసోత్తరమైన ఘట్టము రుక్మిణీ కల్యాణము, ఇది తెలుగువారి పెండ్లిపోలికలను

ముమూర్తుల పోలియున్నది. రుక్మిణీదేవి బాల్యక్రీడలు, ఆమెకు కృష్ణునిమీద ప్రేమోదయ మగుట, బ్రాహ్మణుని చేత నామె సందేశ మంపుట, రుక్మిణీ హరణము మున్నగునవి తెలుగునాట సాజముగా జరుగు నాచారములను దలపించు చుండును. ముద్దులమూట యగు రుక్మిణమ్మ చిన్ననాటి యాటలను గవి యెంత సుందరముగా వర్ణించెనో చూడుఁడు:—

పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలల తోడ వియ్యంబు లందు
గుజ్జనగూళ్ళను గొమరొప్ప వండించి
చెలులకుఁ బెట్టించుఁ జెలువు మెఱసి
రమణీయ మందిరారామ దేశంబులఁ
బువ్వుఁదీగెలకును బ్రోది వెట్టు
సదమల మణిమయ సౌధభాగంబుల
లీలతో భర్మడోలికల నూగు
బాలికలతోడఁ జెలరేగి బంతులాడు
శారికా కీర పంక్తికిఁ జదువు సెప్పు
బర్హి సంఘములకు మురిపములు గఱపు
మద మరాళంబులకుఁ జూపు మందగతులు.

ఈ గుజ్జనగూళ్ళు, బొమ్మపెండ్లిండ్లు తెలుగు బాలికల శైశవ క్రీడలు. మనవారు పావురాలను, గోరవంకలను, రామచిలుకలను బెంచి ప్రేమించుటయు నిందు వర్ణిత

మయ్యెను. శ్రీకృష్ణునకు రుక్మిణి పంపిన సందేశ మెంతయో ప్రేమ పూర్ణమును స్వాతంత్ర్య సమన్వితమునై యామెకు సత్కార్యము నందుగల తెగువకు దార్కాణమై యున్నది. రుక్మిణి బాలిక, పితృపరాధీన. అయిన నేమి? వలచిన వరుని బెండ్లాడుటలో నామె వెనుకడుగు వేయలేదు. సామాన్యముగా పురాణకాలపు క్షత్రియకన్య లెల్ల నిట్టి వారుగనే యగపడుచున్నారు. సీత, సావిత్రి, దమయంతి మున్నగు కన్నె లిందుకు దృష్టాంతలు. యోగ్యమును ధర్మ సమ్మతమును నిగు మనోరథమును దీర్చుకొనుటకు స్త్రీ పురుష భేదము లేక స్వాతంత్ర్య ముండవలసినదే. అట్టిదే వీరి చరిత్రలచే తెల్లమగుచున్నది.

రుక్మిణీ సందేశమును వినుచు విప్రుడు శ్రీకృష్ణునితో నెంతగా నచ్చజెప్పుచున్నాడో చూడుడు:—

ఆ యెలనాగ నీకుఁ దగు
నంగనకుం దగు దీవు మా యుపా
ధ్యాయులయానఁ బెండ్లియగుఁ
దప్పదు జాడ్యము లేల నీవు నీ
తోయము వారిఁ గూడుకొని
తోయరుహాననఁ దెత్తుఁగాని వి
చ్చేయుము శత్రుల న్నుఱుము
నేయుము నేయుము శోభనం బిలన్.

ఈతఁ డీ నాటి దళారులవంటి సంబంధమును గుదుర్చు వాడు కాడు. వధూవరుల శ్రేయస్సు నూహించి కార్యము నెఱవేర్పగల దిట్ట. అందుకే మా గురువుల తోడని యొట్టు పెట్టుకొని మఱి నచ్చజెప్పుచున్నాడు. విప్రవాక్యములు శ్రీకృష్ణునకు ప్రియము లైనవి. అయిన తన మనోరథమును గూడ ఆతనికి దెల్పవలదా ?

కన్నియమీద నా తలపు
గాఢము - కూరుకురాదు రేయి నా
కెన్నడు, నావివాహము స
హింపక రుక్మి దలంచు కీడు నే
మున్న యెఱుంగుదుం బరుల
నూఁక వధించి కుమారిఁ దెత్తు, వి
ద్వన్నుత ప్రాను ద్రచ్చి వన
వహ్నిశిఖన్ వడిఁ దెచ్చుకైవడిన్.

అని కంటికి నిద్రకూడ వచ్చుట లేదనుటలో దనకు గల గాఢానురాగము వేయిరెట్లు వ్యక్తమగునట్లు పలికి నాడు యువకృష్ణుడు. ఇట్టిపట్టుల మహాకవి పోతన పాటించిన యౌచితీ విధానము, పాత్రల హృదయ ప్రకటనల రీతులు గణ్యములు.

తరువాత విప్రునిరాక యాలస్యమగుడు రుక్మిణీదేవి పొందిన తహతహను కవి మనోజ్ఞముగా వర్ణించినాడు. ఋషి సమానుడగు పోతనకవి దివ్యదృష్టితో రుక్మిణీవిరహము నవ లోకించి వ్రాసినాడా యని యీ పద్యము లనిపించును.

"లగ్నం బెల్లి వివాహము గదిసె నే
లా రాఁడు గోవిందుఁ డు
ద్విగ్నం బయ్యెడి మానసంబు వినెనో
వృత్తాంతముఁ బ్రాహ్మణుం
డగ్నిద్యోతను డేటికిం దడసెనో
యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో విరించికృత మె
ట్లంగిం బ్రవర్తించునో."
"ఘనుఁడా భూసుర డేగెనో ? నడుమ మా
ర్గశ్రాంతుడై చిక్కెనో,
విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో,
విచ్చేయునో, యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో తలఁపడో,
యార్యా మహాదేవియుఁ
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగదో,
నాభాగ్య మెట్లున్నదో !"
"పోడను బ్రాహ్మణుండు యదు
పుంగవు వీటికి, వాసుదేవుడుఁ
రాడను, నింకఁ బోయి హరి
రమ్మని చీరడు నిష్టబంధుడున్
లేడను, రుక్మికిం దగవు
లేదిటఁ జైద్యున కిత్తునంచు ను
న్నాఁడను, గౌరి కీశ్వరికి
నావలనం గృప లేదు నేఁడనున్."

ఇట్లు రుక్మిణి హృదయములో ఎన్నెన్ని భావములు, ఊహలు సంచారము చేసినవి! కార్యమా, యావజ్జీవిత మను భవింప దగిన వివాహ బంధనమునకుఁ జెందినది. రుక్మి చూాత మన్న శిశుపాలున కీయ సంకల్పించి యున్నాడు. తల్లిదండ్రులు మధ్యస్థులు. తన వాంఛ వేఱు. ఇట్టి స్థితిలోని రుక్మిణీదేవి హృదయావస్థను, భావములను గవి పై రెండు పద్యము లలో నెంత చక్కగనో వర్ణించి, తన మహాకవి బిరుదమును సార్థకించుకొన్నాడు. రుక్మిణీ వివాహ సందర్భములోని యొడి దుడుకుల వంటివి పెక్కు వివాహములందు గలుగుట మన మెఱుగుదుము.

ఇంతటి హృదయబాధ కగ్గమైన రుక్మిణికి ప్రపంచము తోఁచునా? ఆమె యవస్థ ఆమె యుపాస్యదేవత ఆర్యకు, ఆ మహాకవికే దెలియ వలయును. తెలిసిన పోతన్న యిట్లను చున్నాడు.

చెప్పదు తల్లికిం దలఁపుఁ
జిక్కు, దిశల్ దరహాస చంద్రికం
గప్పదు వక్త్రతామరస
గంధ సమాగత భృంగ సంఘముం
ద్రొప్పదు నిద్రకైకొన దు
రోజ పరస్పర సక్త హారముల్
విప్పదు కృష్ణమార్గగత
వీక్షణపంక్తులఁ ద్రిప్ప దెప్పుడున్.

తుడువదు కన్నులన్ వెడలు
        తోయకణంబులు కొప్పుఁ జక్కఁగా
ముడువదు నెచ్చెలిం గదిసి
        ముచ్చటకుం జన దన్న మేనియున్
గుడువదు నీరముం గొనదు
        కూరిమిఁ గీరము జేరి పద్యము
నొ్నుడువదు వల్లకీగుణ వి
        నోదము సేయదు డాయ దన్యులన్.

ఇట్లు రుక్మిణీ హృదయావస్థను వర్ణించు పద్యములు ఇంకను గలవు. గ్రంథము పెరిగిపోవునను భీతి నుదాహరింప మానితిని.

కవిత్రయమునకు బిమ్మట పట్టినది బంగారము సేయ గల కవితాప్రౌఢిమ, పాత్రపోషణశక్తి సంభాషణల జిత్రించు నేర్పుగల పోతరాజు ఆ యా ఘట్టములలో రసికుల నలరించి తెలుగు హృదయాలలో చిరస్థానము నాక్రమించుకొన్నాడు. ఈతని ప్రతివర్ణనమును, ప్రతి కథాకథనమును, రసభావముల చిప్పిలఁ జేయుచుండును.

సంతాన బాహుళ్యము చేతను, దారిద్ర్యము చేతను క్రుంగి కృశించు కుటుంబమును పోతన కుచేలోపాఖ్యానములో చక్కఁగా వర్ణించినాడు. ఆదర్శ గృహిణియగు కుచేలుని భార్య నాథునిగూర్చి చెప్పుచున్న మాటలు మనవారి పేదకాపురము లలో నిల్లాండ్రు పలుకునట్టివే.

లలిత పతివ్రతా తిలకంబు వంశాభి
జాత్య తద్భార్య దుస్సహదరిద్ర
పీడచేఁ గడు నొచ్చి పెదవులుం దడుపుచు
శిశువు లాఁకటిచిచ్చుచేఁ గృశించి
మలమల మాడుచు మానసం బెరియంగఁ
బట్టె డోరము మాఱఁ బెట్టు మనుచు
పత్త్రిభాజన ధృతి పాణులై తనుఁ జేరి
వేడిన వీనులు వాడినట్లు
య్యైన నొకనాడు వగచి నిజాధినాథుఁ
జేరి యిట్లని పలికె నో జీవితేశ !
తట్టుముట్టాడు నిట్టి పేదఱిక మిట్లు
నొంప దీని కుపాయ మూహింప వైతి.

పేదఱికము ననుభవించుటలో పోతన్నయు పెద్దన్నయే. కావున నిట్టి వర్ణన మాతనికి నల్లేరుపై బండి. పోతరాజుకవిత్వ మునం దిట్లా యా రసములు తగినట్లు పోషింపబడి పాఠకుల నలరించు చుండును. భారత రామాయణములను పెక్కురు రచించుటకు బూనుకొన్నారుగాని, భాగవతమును మఱల నాంధ్రీకరింప బూనినవా రెక్కువగా లేరు.

ఆంధ్రసాహిత్యాకాశమున తిక్కన పోతనలు సూర్య చంద్రులవంటి వారని శ్రీపింగళి లక్ష్మీకాంతముగా రన్నారు. ఈ మాట పొల్లుపోని వరాలమూట. ఆ కవి తల్లజుల స్థానమట్టిది.

## ఉపసంహారము

హిందూమతములో ఈ రామాయణ భారత భాగవతముల కద్వితీయ స్థాన మున్నదని యిప్పటికి మనము గ్రహింపగలిగి యుందుము. ఇందుకు మొదటి కారణము ఇవి వేద ధర్మములనే యనువదించుచు మానవులకు హితాహితములను బోధించు చుండుట. రెండవ కారణము అనేకులగు మహాపురుషుల చరిత్రములనే గాక, భారతీయుల దృష్టి ననుసరించి భగవంతుని అవతార గాథలను లీలలనుగూడ నివి వర్ణించుట. అందుచే ఐహిక పారమార్థికములగు రెండు ఫలములను బడయనెంచు భారతీయుల కివి మతగ్రంథములునై వారి మన్ననం బడసినవి. వీనిలో మతమునకు, వేదాంతమునకు సంఘమునకు, నీతికి, ధర్మమునకు సంబంధించిన విషయములు సమగ్రముగా చర్చింపబడి యున్నవనవచ్చును.

వేదములను వదలినచో, తరువాతి కాలపు సంఘ జీవనమును ప్రతిబింబింప జేసికొన్నది రామాయణము. అటు పిమ్మట భారతీయుల జీవిత విధానములను భారత భాగవతములు చిత్రించు చున్నవి. భారత భాగవతములు ఇంచుమించు ఒకే కాలమునకు సంబంధించినట్టివే యనవచ్చును. శ్రీకృష్ణ నిర్యాణముతో భారతీయ సాంఘిక చరిత్రములో నొక పెద్ద యధ్యాయము ముగియు చున్నది. తరువాతి సంఘచరిత్ర బుద్ధ శంకర మహావీరాది మహాపురుషులతో ప్రారంభ మగు

చున్నది. శ్రీరామ చంద్రమూర్తినుండి శ్రీకృష్ణుని కాలము వఱకును గల భారతీయ చరిత్రములోని గుణాగుణములను మనము రామాయణ మహాభారత భాగవతములను బట్టి కొంత వఱకు నిర్ణయించకొన వచ్చును. ఈ గ్రంథములు శ్రీరామునికి పూర్వకాలపు చరిత్రములను గూడ వర్ణింపక పోవుటలేదు. వర్ణించినను వానికి ఈ చరిత్రకంటెను ప్రత్యేకత యున్నట్లగపడదు.

బుద్ధోదయముతో నారంభమయిన సాంఘికాది పరిణామము లనేకము లున్నవి. అట్టి వన్నియును కొన్ని నశించియు, కొన్ని చిఱు చరిత్రలరూపమును దాల్చియు నున్నవే కాని పురాణ బద్ధములు కాలేదు. తరువాత నేటి గాంధీ యుగపు పరిణామములుగూడ భారతీయ సాహిత్య చరిత్రలో సుస్థిర స్వరూపమును దాల్చవలసి యున్నవి. వీనికిదోడు వైదేశికులగు జీససు ప్రభృతి మహనీయుల జీవితోదంతములను గూడ కలుపుకొని సమగ్రమును సర్వజనీనమును నగు మానవ చరిత్రముతో నిండిన పురాణకల్పములగు మహాకావ్యము లీనాడు వెలయవలసిన యవసర మెంతయేనిగలదు. మహాభారత యుద్ధానంతరము వ్యాసమహర్షి మూడేం డ్లేకాంత వాసము చేసి మహాభారతమను నుత్తమ కావ్యమును రచించి

చరితార్థుడై లోకమునకు దారిచూపినట్లు, ఈనాడును ఋషి ప్రాయులును రాగద్వేషవిరహితులు నగు కవులు భారతము వంటి యుద్ధగ్రంథమును సృష్టించవలసిన యవసర మున్నది. ఈనాడు బహుముఖములుగా విస్తరిల్లిన విజ్ఞానవిశేషములు, హిందూ బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయ గాంధి యుగముల సాంఘిక రాజకీయాది పరిణామ విశేషములు అందు సాకల్యముగా సాహిత్య శిల్పముతో రూపుదాల్చవలయును. ఇట్టి గ్రంథములు లేనికొఱత ఆధునిక సాహిత్యమునకు గలదు. అట్టికొఱత దీఱు శుభదినము లచిరకాలములోనే వచ్చుగావుత మని యాశింతము.

ఓం తత్ సత్